# పగడాలు



ఆచంట శారదాదేవి

అబ్బాయి

మారుతీరావుకు

ప్రేమతో:

ఆచంట జానకిరామ్

ఆచంట శారదాదేవి.

1960

3.12.'60

# ప గ డా లు

(కథానికలు)

ఆచంట శారదాదేవి

ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

422

# ప్రశంస

జీవితం అనే తోటలో ఏరిన వివిధపుష్పాలు ఈ సంపుటి లోని కథానికలు. సంపుటికి 'పగడాలు' అని నామకరణం చేశారు గనుక దీన్ని తెలుగుభారతికి పగడాలమాల అని అంటే సార్థకంగా ఉంటుంది.

జీవితం అనేకవేల మైళ్లు ప్రవహించే నదివంటిది. ఏ చోట ఏ పాత్రతో ముంచినా లభించేది ఆ నది నీరే. కవి ఏ వస్తువు గ్రహించినా అది జీవితానుభవమే అవుతుంది.

ఈ కథానికలలో నన్ను ముఖ్యంగా ఆకర్షించిందేమంటే — స్త్రీ హృదయంలో ఉండే అనుస్యూత సంస్కృతి, అజ్ఞాత వాంఛలు, అవ్యక్త భావతరంగములు, అసమాన లాలిత్యము, అవ్యాజ కారుణ్యము, అఖండత్యాగము—చక్కగా నిరూపించారు ఆచంట శారదాదేవిగారు. స్త్రీ హృదయ రహస్యం స్త్రీ దృష్టికే విదితమేమో ?

ఈవిధంగానే ముత్యాలు, రత్నాలు, కెంపులు, పచ్చలు ఎన్నెన్నో ఏర్చి కూర్చి ఆభరణాలు తెలుగుతల్లికి సమర్పించగల రని నా కోరిక.

రాజమన్నారు

[ప్రధాన న్యాయమూర్తి శ్రీ పాకల వెంకట రాజమన్నారు]

'ఎంత తియ్యని సంగీతమైనా యేదో అపశృతి. చల్లని గంగాజలంలోకూడా యేదో వేడిమి. మధువులోకూడా యేదో చిరుచేదు. జీవితమే యింతేనేమో!' (పు. 120)

వికాసోన్ముఖమైన అనుభవపరిణతి చాలని సీమంతినీ హృదయంలోని వేదన యిది. 'ఇంతేనేమో' అనేకాని 'ఇంతే' అని ధైర్యంతో చెప్పలేని హృదయం. దైన్యం, ధైర్యంగా వేషంవేసుకొనడానికి ముందు జీవిత నేపథ్యంలో చూపే అవ్యవస్థ, తొందర—ఈ వేదన.

దాన్ని ఎంతో సహానుభూతితో ఈ ప్రబంధ సంగ్రహం లోని ఒక్కొక్క ఖండికలోనూ చల్లగా సన్నని కంఠంతో చిత్రించారు శ్రీమతి ఆచంట శారదాదేవి.

వీటిని ప్రబంధాలనడం పొరబాటేమో. తెలుగు సారస్వతంలో ఆ పేరు కొంత నిస్తేజమును అలవరచుకొన్నది. మరి సంగీతంలో ఒక్కొక్క పాటకూ ప్రబంధమనేది పాతపేరు. ఒక స్వరభావం, పల్లవి, దానిమట్టూ దాన్నే పోషించి చరితార్థమయ్యే చరణం—నాలుగైదు పంక్తులది- అంతటితో ఆ రూపం ముగిసింది. ఇందలి ప్రకరణాలు అట్టివి.

ఒక్కొక్క ప్రకరణమందూ ప్రధానభావం ఒకటే: మీద చెప్పినది. దాన్ని పోషించేసందర్భాలు వేరు. ముఖ్యవిషయాన్ని మీరిపోయే మాటలుగాని, నడతలుగాని యిందుండవు. కథ అని పేర్కొనదగిన దేదీ ఇందులో లేదనే చెప్పవలెను. ఉద్రేకాలు, ఆక్రోశాలూ లేవు. అన్నీ ధ్వనిప్రధానంగా పాత్రల వ్యవహారాలు సాగును. రచయిత్రి చూపిన యీ సంయమం, తీర్చిన రేఖలందలి దిట్టతనం- ఇందలి విస్మయావహమై కమనీయమైన కళారహస్యం. చిన్నదైనా ఒక్కొక్క సందర్భమూ చదివిన తరువాత పుస్తకము క్రిందబెట్టి భావనలో చిత్రించుకోవలసినవి. ఆడంబరమనేది ఎక్కడా లేక యెంతోలోతులుచూపేచల్లనిరచన.

ఇట్టివెన్నో ఇంకా శ్రీమతి శారదాదేవి చేతిమీదుగా రావలసినవని నా యాశ, నా యాశీస్సు.

16-9-60 రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

# పరిచయం

'ఏదైనా పుస్తకం సమీక్ష చెయ్యాల్సివొస్తే సమీక్షించేముందు మాత్రం ఆ పుస్తకం చదవను. చదివితే పక్షపాతం ఏర్పడుతుంది.' అని హాస్యలేఖారచయిత సిడ్నీస్మిత్ ఛలోక్తి. ఇది సమీక్ష కాకపోవడం, పక్షపాతం ఏర్పరుచుకోడానికి వీలులేకుండా, ఇదే శారదాదేవి మొదటి పుస్తకం కావడం నా అదృష్టం. ముందు చదివి, ఆమెపట్ల పక్షపాతం ఏర్పరుచుకొని పరిచయానికి పూనుకుంటున్నా.

ఈనాడుఅన్ని దేశాలలోనూ వేలాదిగా కథలు వెలువడుతున్నా, కథకులుగా పేర్కొనతగ్గవారు కొద్దిమంది మాత్రమే. వారు కథలు వ్రాయకుండా జీవించలేరు. వారికది వొక వ్యాపకం - హాబీ - కాదు. అది వారి జీవిత పరమావధి. వారు వందలాది కథలు వ్రాసినా, ఏ వొకటి రెండో విమర్శకుల మన్ననల నందుకుంటాయి. మరి కొందరు కథకులున్నారు. వారి కథలలో ఏ వొక్కదాన్నో పేర్కొని 'ఇది చాలా గొప్పకథ' అని విమర్శ విలువకట్టకపోయినా, వారి కథలు ఒకటి రెండు చదివి ఆనందించడానికి అలవాటుపడినట్లయితే వారిప్రతికథా చదివితీరాల్సిందే. వారిలో వొకనిజాయితీ వొక వ్యక్తిత్వమూ, మనల్ని ఆకర్షిస్తాయి. ఏ ఉత్తమ రచనకుగాని అనుభవం అతి ముఖ్యం. ఈ అనుభవంవల్లనే నిజాయితీ కలుగుతుంది. అతి ప్రధానమైన ఈ నిజాయితీకి అందముకోసమూ అలంకరణకోసమూ ఊహ,కల్పనా సాయపడతాయి. నిజమైన అనుభవము ఈ ఊహ,కల్పనలతో ఎంతో ఆకర్షవంతంగా అమరుతుంది. అది సాధించినవారు మనకి సన్ని

హితులవుతారు. ఏంటన్ చెకోవ్, కాథెరిన్ మాన్స్ఫీల్డ్, అట్లాంటివారిలో చటుక్కున స్ఫురించే కథకులు. శారదా దేవి ఇట్లాంటి కథారచయిత్రి.

ఈ సంపుటములో 18 కథలున్నాయి. అన్నీమంచివే. నిజానికి కొన్ని కథలేకావు.. అంటే, వాటిల్లో పాఠకుణ్ణి కల వరపరిచే ఇతివృత్తం కనబడదు. బాహ్యజగత్తులో ఏమీ జరగదు. 'పాలపొంగు' అనే కథలో ఒకామె డాబామీద పచార్లుచేస్తూ ఎదురుగావున్న ఇంట్లో వొక వ్యక్తికేసి చూడ్డం, అతను ఆమెకేసి చూస్తున్నట్లు గ్రహించి తృప్తిపడటం, అతను ఇల్లు విడిచి వెళ్ళిపోతే తను బాధపడడం — అంతే జరుగుతుంది. సమాజం ప్రతిపాదించిన నైతిక నియమాలని అతిక్రమించకుండా, కొత్తకోణాలనుండి అనుభవాన్ని కాంక్షించడం, మెళకువతో అనుభూతిని పొందడం, ఎప్పుడూ ఏదో వొక ఆదర్శం లక్ష్యంగా ఉంచుకుని, అది లభ్యంకాక పోయినాకూడా, విముఖతతో శూన్యంలోకి దిగజారి పోకుండా, జీవితపుటంచులను పరామర్శిస్తూ, ప్రాకృతిక ఆనందాన్ని సాధించగలగాలన్న ఉబలాటం - ఇవి ప్రతి కథలోనూ వ్యక్తమవుతుంది. క్షణం సాక్షాత్కరించి, లిప్తలో అదృశ్యమయ్యే మానసిక స్థితి చిత్రణం అనాలో, గాలి తాకిడికి రాలక అంటిపెట్టుకున్న ఆకులోని గంభీర సౌకుమార్యం అనాలో తెలీదు ఈ లక్షణాన్ని. ఇది శారదాదేవి కథానికలలో ప్రత్యేకత.

శారదాదేవి కథలు చదువుతుంటే మనకు మొట్ట మొదట కనిపించేది ఆమె అనుభవము. జీవితంలో చాలా

మందికి తారసిల్లే అనుభవమే ఆమెకూ కలుగుతూ ఉండవచ్చు. కాని, ఆ అనుభవాలను కొన్నిటిని పదిలపరచుకొని, వాటి విలువను మనతో సున్నితంగా పంచుకోవడములో ఉన్నది నేర్పు. తెల్లవారితే ముహూర్తమనగా కన్యమనస్సులో కలిగే ఆందోళనను అనుభవిస్తున్నా, నిత్యజీవితపు తాపిడివల్ల ఒరసిపోతూన్న గృహిణి జీవితాకాశంలో మెరుపులా మెరిసే ఆశాకిరణాన్ని వర్ణిస్తూన్నా, ఎంతో నిజాయితీ స్ఫురిస్తుంది.

జీవితంలో మనం పాటించే విలువలను చూచి సరియైన విలువకట్టగలదు ఈమె. ఈ విలువకట్టగల నేర్పు సుందరమైన వ్యంగ్యముతో ప్రకటితమవుతుంది. 'ఎర్రగన్నేరు పువ్వు' అనే కథలో ఎర్రగన్నేరుకూ గులాబీపువ్వుకూ మధ్యగల పరస్పర తారతమ్య విచారణలో కొంతవ్యక్తంగానూ కొంత అవ్యక్తంగానూ గొప్ప సత్యనిర్వచన ఉన్నది.

ఈ కథానికలలో వ్యక్తులు, స్థలాలు, సంఘటనలు తెనుగునాట మధ్యతరగతివారి నిత్యజీవితములోనివే. అయినా రచనలో వ్యక్తమయ్యే అనుభూతి అపూర్వమైనది. ఆ అనుభూతి వెనక ఉన్న యవ్వనం, ప్రేమ, ప్రేమలో బాధ, వీటితో ముడిపడిన నైతిక చింతన, – ఈ రచనల్ని వెలిగిస్తాయి. అనవసరమైన వర్ణనలు, వ్యాఖ్యానాలు, సిద్ధాంతాలు, చమత్కారమైన సంభాషణల కూర్పుకోసం పెనుగులాట, దిగ్భ్రమకలగచేసే ముగింపులు, కృత్రిమమన స్తత్వ నిరూపణం, భాషతో కుస్తీలు, నిర్మాణంలో కసరత్తు, ఇవి లేకపోవడం, వీటిలో నిజాయితీ, వీటి అందం.

శారదా దేవికి జీవితంలోతులు తెలుసు. 'తెల్లవార్తే ముహూర్తం' అన్న కథలో వాక్యాలు చూడండి:

'పుట్టినప్పుడే మనముఖాన ఈవిధంగా ఉండాలని, ఈమార్గంలో నడవాలని ముద్రవేసివుంచితే! అద్దంలో అది చదువుకుంటూ ఆమార్గాన్నే అనుసరించవచ్చు. అప్పుడు జీవితంలో సుఖంలేకపోవచ్చు కాని,తప్పుత్రోవయేమోనన్న భయం ఉండదు. హృదయంలో ఆనందం లేకపోవచ్చు. అసంతృప్తి ఉండదు.'

అద్దంలో 'చూసుకుంటూ' అనడం బదులు 'చదువు కుంటూ' అనడం నాకు నచ్చింది.

మరొకచోట; 'ఎప్పుడో, జీవితపు విలువలను తెలుసు కోకుండానే, ఈ జీవితం ముగిస్తుందని స్ఫురించదు.'

ఇట్లాంటి సత్యాలు స్వయంగా తెలుసుకొని, ఋజువు చేసుకొని రచనలో కళానుగుణంగా ప్రదర్శించగల శారదా దేవి ప్రతిరచనా చదువుతాను. మనుష్యులు మారతారు. కాని వారు మారినా మారకపోయినా వారిని గురించిన మన అభిప్రాయాలు కొన్నిమాత్రం మారవు. ఒకరిని గురించి మనం మనహృదయంలో ఎప్పుడో అతి ఆప్యా యంగా నిర్మించుకున్న బొమ్మ అల్లాగే ఉండిపోతుంది. స్త్రీ విషయంలో ఇది మరీను. ఆ బొమ్మ చెక్కుచెదరదు ఊహా ప్రపంచంలో. కాని, ఊహాప్రపంచం వేరు, నిత్యజీవితం వేరు. అందు అడుగుపెట్టేసరికి అపరిమితమైన ఆశాభంగము ఆవహి స్తుంది.ఇదితప్పనిసరి. తత్ఫలితముగా కలిగే తీవ్రమైన బాధా

తప్పనిసరే. కాని, ఆ మొదటిబాధ అనుభవించాక వర్షంకురిసి వెలిసినట్లు మనస్సు ప్రశాంతంగాఉంటుంది. 'అది సుఖమో దుఃఖమో ఆమెకే తెలియదు' అనుకొంటుంది 'కల్పన' అనే కథలో మాలతి.

'పగడాలు', 'రూపాయి విలువ' అన్న కథలను గొప్ప కథలుగా పేర్కొంటాను. ఆ కథ చివరివాక్యంలో చెప్పినట్లు పగడాలు పాఠకుడి 'గుండెల్లో బరువుగా కొట్టుకుంటాయి.' 'ఆకాశాన ఏమూలో ఓ చుక్క రాలిపోతుంది'అని ఆ కథలో మరోవాక్యం. ఆ కథ చుక్కలా పాఠకుడి హృదయంలోకి రాలిపోతుంది. ఆర్థిక వ్యత్యాసాలవల్ల జీవితంలో కలిగే అరిష్టాల భవనం నేలమీద రూపాయిమోత మారుమ్రోగుతూనే ఉంటుంది— 'రూపాయివిలువ' అన్న కథ చదివిం తర్వాత.

ఈ కథలలో వ్యక్తులందరూ యువ్వనులైనా, జీవిత ప్రాంగణంలో అడుగుపెట్టినవారే. కొందరు శిఖరానికి చేరుకున్నారేమో కూడా. చేరుకుని కొందరు, క్రింది లోయలోకి తొంగిచూశారేమో, కాని, రెండో శిఖరం మీదికి దూకే సాహసం వారిలో లేదేమోననిపిస్తుంది. వారి నేత్రాలలో కన్నీటిచుక్క కనురెప్పని అంటిపెట్టుకొని వుంటుంది- కాని ఆ చుక్క క్రిందికి జారదు.

శారదాదేవి రచనల్లో విషాదం, దైన్యం (Pathos) లాలిత్యం, 'అయ్యోపాపం!' అనిపించే ఆమాయకత్వం ప్రధాన లక్షణాలు. మానవుని హృదయంలో చీకటిప్రాంతం, అధోలోకం ఉన్నాయని ఆమెకి తెలుసు. సావాసంచేస్తేకాని,

దాన్ని భేదించి విముక్తి పొందం అనీ ఆమెకు తెలుసు. ఆ రెండో శిఖరంపైకి దూకడానికి తెగింపు కావాలని తెలుసు.

'ఎక్కడో ఒక్కసారి మాత్రం మసక తెర విడిపోతుంది. జన్మాంతర సంస్కారం వొక్కసారి వికసిస్తుంది. దృక్పథం మారిపోతుంది. అనుకోకుండా మృత్యుముఖం ఎదురవుతుంది - భూమి బ్రద్దలై, బ్రహ్మాండమైన లోయ ఎదురైనట్లు, అప్పుడు మణులు, వజ్రాలు అనుకొని మనం కోరి పరితపించినవన్నీ, రంగుపూసలు, చిల్లపెంకులుగా మారిపోతాయి.' అని వొక కథలో ఆమె వాపోతుంది. కాని, కథల్లో వ్యక్తులు, సాహసించి కార్యానికి పూనుకోరు. ఏదో భయం వారిని వెనక్కి లాగుతున్నట్లనిపిస్తుంది. 'మానవుడి కర్మ పట్ల తిరుగుబాటు తలపెట్టేదే కళ' అన్నాడు ఆంద్రెమాల్‌రా.

పెరిగి పెద్దవారై, ఈ తిరుగుబాటుకి, అవసరమైన ధైర్య సాహసాలను అలవరచుకున్న వ్యక్తులను గూర్చి మరెన్నో కథానికలుకూర్చి కథానికా సాహిత్య భవనంపై మరో అంతస్థు నెలకొల్పగలదు శారదాదేవి. తన రచన ద్వారా నిజాన్ని ప్రత్యక్షపరుస్తున్నా, నిరంతర ఆశావాది శారదాదేవి.

బుచ్చిబాబు

# పగడాలు

అప్పుడే పొద్దు వాలుతోంది. దూరాన రెండుకొండల మధ్య, తన తీక్షణత అంతా కోలుపోయి సూర్యుడు రక్త బింబంలా వున్నాడు. కదిలే నునుమేఘాల నీడలు మధ్య మధ్యన గుండ్రని బింబంతో ఆకులలాగా, పువ్వులలాగా, చిన్ని చిన్ని కొండగుట్టల్లా, ఎర్రని అద్దంలో ప్రకృతి ప్రతి ఫలించినట్లు తోస్తున్నాయి. కావిరంగు మేడల్లో ప్రకృతి నాట్యమాడుతోంది.

అప్పుడే తలంటుకొని మేడమీద కొచ్చింది వాసంతి. ముడి విప్పుకుని తల ఆరపెట్టుకుంటో, అస్తమిస్తున్న సూర్యుడి శోభ తిలకిస్తో, పిట్టగోడ అంచున కూర్చున్నది. గాలికి ముంగురులు కదిలినప్పుడల్లా గుప్పున సాంబ్రాణి పరిమళం దిశలన్నీ వ్యాపిస్తోంది. వాసంతి తెల్లని మెడలో ఎప్పటివో పూర్వకాలపు పెద్దపెద్ద గుండ్రటి పగడాలు ఎర్రగా బరువుగా కదలుతున్నాయి... ఆ పగడపు కాంతిలో మీగడ లాంటి చెక్కిళ్లు సిగ్గుపడి కదిలినట్లు కనుపిస్తున్నాయి, ఎర్రని చీర, మెడలో పగడాలు, కుంకుమబొట్టూ, మల్లెమొగ్గల లాంటి గోళ్ళకు గోరింటాకూ, సంధ్యకాంతితో పోటీపడుతూ అందులో లీనమైపోతున్నాయి.

వాసంతి హృదయం ఆవేళంత ఉత్సాహంగా మరెప్పుడూ లేదు. ఎంత చల్లని రోజు... ఎంత చక్కని సంధ్య... వాసంతి హృదయం ఒక్కసారి ఆనందంతో పరవశమైంది.

కాని. మళ్ళీ వెంటనే ఏవో ఆలోచనలలో పడిపోయింది ఆమె......

ఎనిమిదేళ్ళ తరువాత ఇన్నాళ్ళకి మళ్ళా తను ఈ ఊరు వచ్చింది. తన చిన్నతనమంతా ఇక్కడే గడిచింది. ఈ ఊళ్ళో, ఈ ఇంట్లో అడుగడుగునా ఏవో ఎన్నో జ్ఞాపకాలు. చిన్ననాడు తను అనుభవించిన ఆవేదన, ఆశ, నిరాశ, సుఖమూ, సంతోషమూ, ఆతురత, కన్నీరూ అన్నీ మళ్ళీ నీడలల్లా మనస్సులో కదులుతున్నాయి. తోటలో తను ఏరుకున్న పొగడపూలూ, మర్రిచెట్టుక్రింద ఊగిన ఉయ్యాలా, వెన్నెట్లో, మేడమెట్ల దగ్గర, ఇసుక తిన్నెల్లో ఆడిన ఆటలూ, అన్నీ ఏవో కథల్లా జ్ఞాపకంవస్తున్నాయి. ప్రతి నిమిషం ఏదో ఒక ఘటన గుర్తుకువస్తూంది.

తెల్లవారుఝామున రైలుదిగి ఎద్దుబండిలో ఇంటికి వస్తోంటే, ఆ మువ్వల మ్రోతకి నిద్ర మైకంలా వచ్చేసింది. కేసరి పెళ్ళికి రాత్రిపూట రెండెడ్లబండిలో ఊగుతూపోతుంటే తన చుక్కల పట్టుపరికిణి గాలికి ఆడటం, పంకజం నవ్వు, ఆకలితో, నిద్రతో తను ఆవులించటం అన్నీ కలలా కళ్ళ ఎదుట కదిలాయి. గుమ్మందగ్గర బండిదిగి లోపలికి వస్తుంటే మాలతిపొద దగ్గర అనసూయా తనూ ఎర్రగులాబికోసం కీచులాడుకోవటం గుర్తుకువచ్చింది. ఇట్లాగే ఇంకా ఎన్నో ఎన్నో...

ఈ ఎనిమిదేళ్ళలో తన జీవితంలో చాలా మార్పులు వచ్చాయి. ఒక్కొక్క మెట్టు ముందుకు సాగుతూ తన జీవితం పూర్ణవికాసం పొందింది. కలకత్తాలో నాలుగేళ్ళు

చక్కగా చదువుకొని తను బి. ఏ. ఫస్టున ప్యాసయింది. యూనివర్సిటీకే ఫస్టునవచ్చిందని నాన్న ఎంతో సంతోషించి పెద్ద టీపార్టీ ఇచ్చాడు. ఆ తరువాత డిస్ట్రిక్ట్ హెల్తాఫీసరు గారబ్బాయితో తనకి వివాహం అయింది. వాళ్ళు కట్నం ఏమీ అడుగలేదు. అయినా నాన్న ఎంతో డబ్బు ఖర్చు పెట్టి పెళ్ళి ఎంతో దర్జాగా, వైభవంగా చేశారు. అదృష్టం కలిసి, పెళ్ళి అయిన వెంటనే లక్నోలో తన భర్తకి మంచి ఉద్యోగం అయింది. తను అత్తవారింటికి వెళ్ళిపోయింది. ఆ తరువాత ఏడాదికే పాప పుట్టింది. ఆయనకి ప్రమోషనై పెద్ద ఉద్యోగమైంది. ఆర్థికంగా గాని, ఇంకోవిధంగాగాని తన కేలోటులేదు. ఏ బాధా లేదు. భర్త తనని పువ్వులలో పెట్టి పూజిస్తాడు. తనమాట కెప్పుడూ ఎదురు చెప్పడు. తను ఎంతో అదృష్టవంతురాలు... ఎంతో సుఖపడుతోంది. అందరూ అల్లానే అనుకుంటారు.

అయినా, అప్పుడప్పుడు ఏవో చిన్నప్పటి విషయాలు జ్ఞాపకంవచ్చినప్పుడల్లా మనస్సు కలతచెందుతుంది...

పాప పుట్టినప్పుడూ, ఆ తరువాత ఎన్నోసార్లు, ఈ ఊరు రావాలని ప్రయత్నించింది. కాని ఆరు నెలలకొక సారి ఆయనకి ట్రాన్స్‌ఫరవుతుండడంచేత, ఇంటిగొడవలతో ఎప్పుడూ వీలుపడలేదు. ఇన్నాళ్ళకి మళ్ళీ రాగలిగింది.

ప్రొద్దుగూకింది. ఆకాశమంతా నక్షత్రాలతో నిండి పోయింది. వెన్నెల బంగారంలా మెరుస్తో మూల మూలలా వ్యాపించింది. చంద్రుడు ఉత్సాహంగా నవ్వుతున్నాడు. వాసంతి క్రిందకు వెళ్ళి దువ్వెన తెచ్చుకొని, తల చిక్కుతీసి

వదులుగా జడ అల్లుకున్నది. అప్పుడే విరిసిన మల్లెపూలూ, ప్రొద్దుటి గులాబీలుఅన్నీ దండగాకట్టి తలనిండా పెట్టుకున్నది.

పాపనెత్తుకొని తల్లి మేడమీదకి వచ్చి అడిగింది.

'ఏమే! అన్నానికి వస్తావా?'

'తొందరేం? ... నాన్నగారినికూడా రానీ' అన్నది.

అమ్మ మళ్ళా అడిగింది, ఆకాశంకేసి చూస్తూ 'అతను ఎప్పుడు వస్తారు?'

'ఏమో! ... పండక్కి వస్తానన్నారు — సెలవు దొరికితే...'

అమ్మా, తనూ, మౌనంగా మామిడిచెట్టు పూతకేసి చూస్తూ కూర్చున్నారు కొంతసేపు. ఆ తరువాత పాపకి అన్నంపెట్టి డాబామీద పక్కవేసి పడుకోబెట్టింది. పాప నిద్ర పోతూంటే తనూ ప్రక్కనే పడుకుంది. ఏవో ఆలోచిస్తూ... వెన్నెల చల్లగా ముఖంమీద పడుతోంది. కళ్ళకెదురుగుండా బంగారపు బంతిలా చంద్రుడు చిరునవ్వు నవ్వుకున్నాడు.

ఎన్ని వెన్నెలరాత్రులు, ఉషఃకాంతులు ఈ డాబామీద గడిచిపోయాయో, ఆనందంతో, దిగులుతో, పరిహాసంతో! చిన్నతనంలో, ఆరోజుల్లో, ఏమీ తోచనప్పుడల్లా డాబా మీదికి వచ్చికూర్చునేది. తమఇంటిచుట్టూ దూరాన చిన్న చిన్నకొండలూ, గుట్టలూ ఎన్నోవుండేవి. ఇంటి కెదురుగా అంతా పెద్ద పచ్చికబయలు, ఆ తరువాత అక్కడక్కడ ఎత్తుగా కొబ్బరిచెట్లు, వాటి వెనకాలే రెండు చిన్నకొండలు ఎడాపెడాగా వచ్చి మధ్యన కలుసుకున్నట్లు వుండేవి. ఆ కొండలమీదనుంచి, ఆరయేసరికి, రక్తవర్ణంతో సూర్యుడు

తొంగిచూచేవాడు. సాయంత్రం మళ్ళీ అక్కడే కొబ్బరి చెట్లమధ్యనుంచి చంద్రుడు పలుకరించేవాడు. రోజూ ఈ వింతలు చూస్తూ తను పరవశమయ్యేది.

నిద్రలో పాప వత్తిగిలింది. పాప తల తగిలి మెడలో పగడాలు హృదయానికి గట్టిగా ఒత్తుకున్నాయి. గుండెల్లో ఏదో బరువుగా తగిలింది. అబ్బ!...ఎన్నాళ్ళ నుంచి మోస్తోం దీ పగడాలు!...అవి కదలినప్పుడల్లా హృదయంలో ఏదో తీరని బాధ, ఏదో వ్యథ...

తమ ఇంటి కెదురుగానే, ఆ పచ్చిక మైదానానికంతకీ లక్షుమన్న తాత దొక్కటే గుడిసె వుండేది. అవ్వా, అతనూ తల్లిలేని మనుమరాలు సీతా, ముగ్గురూ ఆ గుడిసెముందరే ఓ చిన్న చిల్లర దుకాణం పెట్టుకొని కాలం గడుపుతుండే వాళ్లు...పొద్దున బండి దిగుతూనే అతని గుడిసె, దుకాణం కనబడతాయేమోనని ఆశగా చూసింది. ఎక్కడా ఆనవాలు కూడా లేదు. ఆ మైదానంనిండా ఎన్నో కొత్త కొత్త రంగు రంగుల మేడలు, ఆకాశమెత్తున లేచాయి. దూరాన కొండ లుకూడా కనుపించటంలేదు. తనకి స్పృహకలిగింది.

పాపం లక్షుమన్నతాత చాలా మంచివాడు...తనంటే ఎంతో ప్రేమ...'బుల్లెమ్మగారు; బుల్లెమ్మగారు' అంటూ తనని నెత్తిన పెట్టుకునేవాడు. ఎంతో గొప్పగాచూచేవాడు. గుడిసెకెదురుగా ఆ పచ్చగడ్డిలో సీతా తనూ ఆడుకునేవాళ్లు ప్రొద్దస్తమానం; అప్పటికి తనకి ఏడెనిమిదేళ్ళుంటాయి. సీతకీ అంతే...ప్రొద్దున్నే నీళ్ళు పోసుకొని, తల దువ్వించు కొని, పట్టుగౌనుతో చక్కగా సింగారించుకొని వెళ్లేది తను.

చింకిరి జుట్టుతో, చినిగిన పరికిణీతో గుడిసెలోనుంచి వచ్చేది సీత. ఇద్దరూ ఆ గడ్డిలో ఎన్ని రకాల ఆటలో ఆడేవారు. గుజ్జనగూడు, గుడుగుడుగుంచంతో ఆరంభమై, బొమ్మల పెండ్లి, కాళ్ళాగజ్జతో సాంతమయ్యేవి; ఒక్కొక్కప్పుడు తను అన్నానికి వెళ్ళటం మరచిపోతుండేది. అమ్మ గుమ్మం లోకి వచ్చి కేకలుపెట్టి పిలుచుకుపోతుండేది.

మట్టిలో ఆడి ఆడి తను జుట్టు రేపుకుని, గౌను చింపు కుని ఇల్లు చేరుతుండేది. అమ్మ రోజూ కోప్పడుతూనే వుం డేది, మట్టిలో ఆ ముష్టిపిల్లలతో ఆడుకోవద్దని. ఎన్నిసార్లో కసిరి చీవాట్లతో ఇంటికి లాక్కుపోతుండేది. కాని తను మాత్రం మళ్ళీ, నిమిషంలో, సందుచూచుకుని సీతదగ్గరికి చేరుతుండేది. అమ్మ విసిగి ఊరుకునేది.

దుకాణం బేరం లేనప్పుడల్లా లక్షుమన్నతాత వాళ్ల దగ్గరకు వచ్చి కూర్చుని కథలూ కబుర్లూ చెబుతుండేవాడు. సీతతోబాటు తనూ అతనిని 'తాతా' అనే పిలిచేది. అతనూ సీతకన్నా తననే ఎక్కువ గారాబం చేసేవాడు. తను ఇంట్లో ఆ మూలా ఈమూలా పడివున్న చిన్నచిన్న తగరుముక్కలూం కంచుకడ్డీలు తీసుకువెళ్ళి వెండి బంగారు ముక్కలని తాత కిస్తుండేది. ఆ పనికిరాని ముక్కలన్నీ అతను నిజంగా వెండి బంగారంవాటిలాగే అతి జాగ్రత్తగా తన సీనారేకు డబ్బాలో దాచుకునేవాడు. వాటికి బదులుగా సీతకీ తనకీ పిప్పరమెంట్లూ, చాకిలెట్లూ, కిళ్లీలు ఇస్తుండేవాడు. రోజూ అది ఒక ఆట అయిపోయింది. ఏదో చిల్లముక్క తను పట్టుకు వెళ్ళడం ఎంతో భద్రంగా అతను దాచుకోవడం, చాకిలెటు

నవ్వులుతూ ఏదో గొప్ప పని చేసినట్లు తను సంతోషించ డం... ఎప్పుడో ఓసారి అమ్మతో గూడా చెప్పేసింది. 'ఏమిటీ, వెండిబరిణలో వున్న బంగారపు గుళ్లన్నీ ఇచ్చేస్తున్నావా?' అంది అమ్మ! తను బిత్తరపోయింది. తెల్లమొహంవేసుకుని అన్నది:

'అబ్బె! అది కాదే!... నాకు దొరికినయ్!'

అమ్మ నమ్మలేదు. 'ఆ కొంపచాయకు పోవద్దంటే వినవుకదా' అని విసుక్కున్నది.

...ఇంకోసారి, ఓ రోజు, వాకిట్లోకి పగడాల అబ్బి వచ్చాడు. గంటసేపు బేరంచేసి, అమ్మ ఏరి ఏరి మూడు రకాల పగడాలు కొన్నది. చిన్నవి, పెద్దవి, మరీ పెద్దవి, ఎర్రగా ఎంతో అందంగా వున్నాయి. భరణిలోని బంగారు గుండ్లన్నీ కరిగించి అమ్మ శంకరయ్యచేత మాలలు చుట్టిం చింది. అవి వచ్చిన రోజునే తను అన్నింటిలోకి పెద్ద పగడాల హారం మెళ్లో వేసుకుంది. అమ్మ అది చూసి అయిష్టంతో అన్నది:

'ఛీ! అంత పెద్ద పగడాలు నీ కేం బాగుంటాయి? నీ కోసం ఎంత బుల్లి బుల్లి పగడాలు చుట్టించానో చూడు! అవి వేసుకో'

తను వినలేదు. మారాంపెట్టింది: 'నా కక్కరలేదు! నా కివే బాగున్నాయి!' అమ్మ ఎంతో చెప్పి చూసింది. ఊహు... ఏంలాభం లేకపోయింది... ఆ దెయ్యంలాంటి పగ డాలు వేసుకునే ఆడుకుందుకు వెళ్ళింది. ఆ బరువుకు మెడ నొప్పిగావుండేది. పొడుగాటిదండ తను గెంతినప్పుడల్లా తనతో

బాటు ఎగిరిపడేది. క్రొత్తనగలు వేసుకున్న ఆనందంలో తను ఇవేవీ లెక్కచేయలేదు. నిమిషంలో ఆటల్లో మునిగిపోయింది. ఆ సందట్లో ఆ క్రొత్త దండ సంగతే మరచిపోయింది.

ఆ వేళ ప్రొద్దుగూకి అలసిపోయి తను ఇంటికివస్తే, అమ్మ వేన్నీళ్లుపోసి, వెండి కంచంలో అన్నంపెడుతో కంగారుగా అడిగింది.

'అమ్మో! పగడాలేవే?'

అదరిపోయి, బిక్కమొహంవేసుకుని మెడ తడువుకుంది తను. పగడాలు లేవు; ఆటల హడావిడిలో వాటి గొడవే పట్టలేదు తనకు. ఎప్పుడు పడిపోయిందీ - ఎక్కడ పడిపోయిందీ కూడా తెలీదు.

కోపంతో, దిగులుతో అమ్మ చీదరించుకున్నది: 'వద్దని ఎన్నిసార్లు చెప్పినా విన్నావు కాదు. నిమిషంలో పారేసుకు చక్కావచ్చావు. ఛీ'

ఆతరువాత, నాన్నా, అమ్మా ఇద్దరూ కలసి తనని ఎన్నో ప్రశ్నలువేశారు. ఆ మర్నాడంతా కూడా, ఆ ప్రశ్నల వర్షం ఆగలేదు. ఎంతమంది ఎన్నిసార్లు తనని పదే పదే అవే ప్రశ్నలు అడిగారో! జవాబు చెప్పలేక తనకి విసుగూ, కోపమూ, ఏడుపూ వచ్చేవి.

'ప్రొద్దుటినుంచి ఎక్కడెక్కడ తిరిగావు?'

'ఎక్కడ ఆడుకున్నావు?'

'ఎవరితో ఆడుకున్నావు?'

'పగడాలు ఆఖరుసారి ఎప్పుడు చూచుకున్నావు?'

ఇట్లాగ ఎన్నో ప్రశ్నలు అడిగారు. తను అన్నింటికీ తనకి తోచినట్లు ఏవో తెలిసీ తెలియని జవాబులు చెప్పింది.

'మండువాలో ఆడుకున్నాను' 'మేడమీద గదిలో సావిత్రితో ఆడాను' 'పగడాలు అప్పుడప్పుడు చూసుకుం టూనే వున్నాను' అని ఏవేవో చెప్పింది, కాని ఎందుకో చాల సేపు దుకాణందగ్గర సీతతో ఆడుకున్నానని మాత్రం చెప్పలేదు. అమ్మ ఏమంటుందోనని, సీతని తాతని ఏమన్నా అంటారేమోనని భయపడింది.

ఆ రాత్రి పన్నెండింటివరకూ అమ్మా నాన్నా ఇల్లంతా వెతుక్కున్నారు ఎక్కడా పగడాలు దొరకలేదు. భయంతో దిగులుతో, ఏడుస్తో నిద్రపోయింది. తెల్లవారి మళ్ళీ ఇంటిల్లి పాదీ మూలమూలలా వెతికారు. చుట్టుపక్కల అందరికీ తెలి సింది పగడాలు పోయాయని; ఇరుగూ, పొరుగూ అంతా పరామర్శకి వచ్చారు. సాంత్వనవాక్యాలు పలికేవారు, సల హాలు చెప్పేవారూ, అంతులేదు.

'అన్ని చోట్లా బాగా వెతికారూ ?'

'పాపం పాతిక రూపాయలసొమ్ము'

'ఎవరైనా తీసివుంటారేమో —ఎవరిమీదనైనా అను మానం వుందా ?'

ఇట్లాగే ఎన్నో ప్రశ్నలూ, వాక్యాలూ. పాపం అమ్మ మాత్రం అందరికీ ఓపికగా, వివర్శగా, జవాబు చెప్పేది. అసలు ఆవిడకి చెప్పిందే మళ్ళీ మళ్ళీ విపులంగా చెపుతుంటె ఎంతో ఉత్సాహంగా, సరదాగా వుండేది. వస్తువు దొరికి నట్లే వుండేది.

ఎనిమిదయ్యేసరికి ప్రక్కవీధినుంచి బాబాయ్ వచ్చాడు. వస్తూనే తన వంతుకి ప్రశ్నలవర్షం ప్రారంభించాడు. అమ్మని అడిగాడు:

'పగడాలు ఎప్పుడువేశావు?' 'మళ్ళీ ఎప్పుడు చూశావు?' అంటూ. అమ్మ ఏదో చెప్పింది. హఠాత్తుగా బాబాయి అడిగాడు:

'రోజూ ఆడుకోటానికి ఆ ముసిలాడి కొట్టు దగ్గరికి పోతుంటుందిగా! నిన్న పోలేదూ?'

అమ్మ విస్తుపోయింది, ఇంత స్పష్టమయిన విషయం తన కింతవరకూ తోచనందుకు. ఆమె మందబుద్ధికి ఎంతో నొచ్చుకుంటూ ఎక్కడో మూల దాక్కున్న తనను పిలిచి అడిగింది.

'ఏమే! నిన్న సీతతో ఆడుకోడానికి పోలేదూ?'

...'ఎప్పుడో ప్రొద్దున వెళ్ళాను' అని భయపడుతో చెప్పింది తను.

బాబాయి వెంటనే నిర్ధారణకి వచ్చాడు. 'ఇంకేం! ఆ గుడిసె దగ్గరే ఆడుకుంటూ వుంటే పడిపోయి వుంటుంది. ఆ ముసిలాడే తీసివుంటాడు' అన్నాడు.

అమ్మ అదే సమర్థించింది:

'అవును; తప్పకుండా వాడే తీసివుంటాడు. అసలు వాడు రోజూ అమ్మడిని ఇంట్లోంచి వెండి బంగారం చిల్లర ముక్కలన్నీ తీసుకురమ్మని అవన్నీ కాజేస్తుండేవాడు.'

తను నిర్ఘాంతపోయింది. 'అబద్ధం!! తాత తన్నెప్పుడూ ఆ ముక్కలు తీసుకురమ్మని అడుగలేదు. తనే ఆ

మూలా ఈమూలా దొరికినవన్నీ ప్రోగుచేసుకొనిపోతే, తాత పట్టినే సరదాకు, తనని సంతోషపెట్టడంకోసం అవన్నీతీసుకుని దాచేవాడు'—ఈ మాటలు గట్టిగా అరచి అమ్మాకు చెప్పా లనుకున్నది. కాని ఆ సందట్లో గొడవలో నోరు విప్ప లేకపోయింది.

బాబాయ్ వెంటనే వెళ్ళి తాతను పిలుచుకొచ్చాడు. మండువాలో పంచాయితీ ప్రారంభమైంది. బాబాయ్ నోటికి వచ్చినట్లు కేకలువేసి చీవాట్లుపెట్టి తాతని ఎంతో బాధ పెట్టాడు. 'ప్రొద్దుటినుంచి నీ గుడిసెముందరే ఆడుకున్నది పిల్ల. నీవు తీయకపోతే ఎవరు తీస్తారు?' అన్నాడు.

తాత ఆ మాటలు వినబడనట్లూ, అర్థంకానట్లూ నిర్ఘాంతపోయి తెల్లమొహంవేసుకు నించున్నాడు. నలు గురూ ఏమంటున్నదీ అతను సరిగా వినిపించుకోలేదు. అవ మానంతో, బాధతో కృంగిపోయి నించున్నాడు. రెండు మూడుసార్లు దీనంగా అన్నాడు.

'నేను ఎరుగనండీ... బుల్లెమ్మగారి మెడలో పగడాలు అసలు నేను చూడనేలేదు.' ఇంకోమాటు అతి జాలిగా అన్నాడు.

'బుల్లెమ్మగారిని మా సీతకన్నా ఎక్కువగా చూసు కుంటున్నాను. ఆమెవంటిమీద వస్తువు ముట్టుకుంటానాండి?'

అయినా, అతని మాటలు ఎవరూ వినిపించుకోలేదు. అమ్మ అన్నది:

'ఏదో తీసుకున్న వస్తువు మంచిగా యిచ్చేయి! ఎందుకు అనవసరంగా అల్లరిపాలవుతావు!'

'నేను తియ్యలేదే! నా దగ్గర లేందే!' అని స్పష్టంగా గొణుక్కుంటూ, అమ్మమాటలు వింటూ విస్తుపోయి నించు న్నాడు తాత.

బాబాయ్ అన్నాడు. 'చూడు లక్ష్మన్నా, మెల్లిగా మర్యాదగా అది ఇచ్చేసి దండంపెట్టు, లేకపోతే ఇంక పోలీసు లకు రిపోర్టు ఇవ్వాలిసివస్తుంది. పోలీసులచేతులో పడితే ఏమవుతుందో నీకు తెలుసుగా!'

పోలీసుపేరు వినగానే తాత అదిరిపోయాడు. భయంతో గజ గజ వణికాడు. నోట మాటరాలేదు.

ఆ సమయానికే దారినిపోతూ, పోలీసు నరసయ్య లోపలికి వచ్చాడు - లాఠీకర్ర ఊగించుకుంటూ. బాబాయ్ని చూసి అడిగాడు:

'ఏమిటండీ? ఏమిటి సంగతి?'

'ఏంలేదోయ్' అంటూనే బాబాయ్ అంతా మొదటి నుంచి సవిస్తరంగా ఒక కథలా చెప్పాడు.

పోలీసునరసయ్య తాతని బెదరిస్తూఅన్నాడు: 'ఏం వోయ్ ఎందుకూ- ఏదో చప్పున తేల్చుకో... లేకపోతే స్టేష నుకునడవాలసిందే' అని, లాఠీకర్ర ఠీవిగా నేలమీద తడుతూ తాతకేసి గుడ్లురిమి చూశాడు.

తాత దుఃఖంతో మతిపోయినవాడిలా నించున్నాడు. అతని కళ్ళల్లో నిరాశ తనని చుట్టుకుని దహించివేస్తోంది. సీత తాత కాళ్ళకు పెనవేసుకుని భోరున ఏడ్చింది. తనకీ ఏడుపొచ్చింది. తనూ ఏడ్చింది.

ఒక్కక్షణం ఏమీ దిక్కు తెలియనివాడిలా, నిద్రలో నడుస్తున్నట్లు కొట్టుదగ్గరికి వెళ్ళాడు తాత—అతను ఎన్నాళ్ళనుంచో ప్రాణప్రదంగా దాచుకుంటున్న సీనారేకుడబ్బా పట్టుకొని మళ్ళా వచ్చాడు. డబ్బా తెరిచి నలిగిపోయి ఉండలా ముడిచివున్న ఎప్పటిదో పాత పదిరూపాయలనోటు తీసి బాబాయ్‌కిస్తూ అన్నాడు:

'బాబూ! పగడాలు నేను చూడలేదు. కాని. ఇది తీసుకొని నన్ను విడిచిపెట్టండి. బీదవాణ్ణి. ముసలివాణ్ణి, కళ్లు కూడా సరిగా కనపడటంలేదు. నన్ను హింసపెడితే మీకేమొస్తుంది బాబూ! !'- అంటూ కళ్లనీళ్లు పెట్టుకున్నాడు.

అందరూ కూడబలుక్కొని పగడాలు దొరకనప్పుడు డబ్బు తీసుకోవడమే మంచిదనుకున్నారు. అమ్మ అన్నది:

'పాతికరూపాయలపగడాలు! పదిరూపాయలేమిటి?—ఏదో ఎరుగున్నవాడివని చూస్తున్నాం—ఇంకోపదయినా వేసుకో!'

'అవును అంతే' అన్నాడు బాబాయ్.

బాధపడుతో, ఏడుస్తో, మళ్లీ డబ్బాలో తడిమి ఇంకో మూడురూపాయబిళ్ళలు తీసి బాబాయ్ చేతిలో పెట్టాడు.

తాత వణికిపోతున్న కంఠంతో అన్నాడు: 'నాకున్న ఆస్తంతా ఇదేనండి ఇంక నన్ను చంపినా ఇంతకన్న ఇచ్చుకోలేనండి.'

ఖాళీడబ్బా చేయిజారి క్రిందపడి ఖంగున మ్రోగింది.

బాబాయ్ ఏదో అనబోయినాడు; కాని, ఇంతవరకు తన కేమీ సంబంధములేనట్లు అమ్మనోటికి జడిసి మౌనంగా కూర్చున్న నాన్న అందుకున్నారు:

'పోనిద్దురూ! ఆ ముసిలాడిని ఎందుకు బాధపెట్టుతారు;'

దాంతో, బాబాయ్ ఊరుకున్నాడు. అమ్మా ఊరుకున్నది.

సీతచేయి పట్టుకుని అడుగులు లెక్కపెట్టుకుంటూ తాత వెళ్ళిపోయాడు.

తల తడుముకుంటూ, ఏదో ఘనకార్యం చేసినట్లు 'అయ్యా! తమ దయ!' అంటూ, చేయి చాపాడు పోలీసు నరసయ్య. రెండురూపాయలు చేతిలో వేయించుకుని దారి పట్టాడు. మెల్లి మెల్లిగా అందరూ ఎక్కడవాళ్ళక్కడ కెళ్ళిపోయారు.

తనుమాత్రం మండువాలో అట్లానే కూర్చుంది. కన్నీళ్ళు ఆగకుండా ఏకధారగా కారాయి. తనకి స్పష్టంగా తెలుసు: తాత తన పగడాలు తియ్యలేదు; తియ్యడు. కాని ఈ మాట నలుగురితో చెప్పలేకపోయింది. అనవసరంగా తాతకి బాధకలుగుతూంటె చూస్తూ ఊరుకున్నది.

ఒక్కసారి పరుగెత్తుకువెళ్ళి తాత చేయి పట్టుకుని చెప్పాలనిపించింది: 'నాకు తెలుసులే తాతా! నీవ్వు నా పగడాలు తీయలేదనీ, ఏమనుకోబోకు!!' అని. గుమ్మం దాకా వెళ్ళింది. కాని, వెనకాలే అమ్మ వచ్చి, రెక్కలు పట్టుకుని లోపలికి లాక్కుపోయింది.

—ఆ తరువాత అమ్మ ఎప్పుడూ తనని తాతదుకాణం చాయలకుపోనివ్వలేదు. ఓనాడు మేడమీద గదిలో పోలమ్మ గది ఊడుస్తుంటే, బీరువాక్రిందనుంచి పగడాలు ఎగిరి బయటపడినవి. తను రివ్వున ఒక్క గంతువేసింది. పోలమ్మ కెవ్వున ఒక కేకపెట్టింది:

'అమ్మగారూ ! పగడాలిక్కడుండాయండీ !'

అమ్మ గబగబా మేడమీదికి వచ్చింది. ఎర్రగా, పడివున్న పగడాలదండ చూసి విస్తుపోయింది. సంతోషంతో సిగ్గుతో, పగడాలు చేతులోకి తీసుకుని అన్నది: 'ఇల్లంతా గాలించాముగాని, ఈ బీరువాక్రింద చూడాలనితోచనేలేదు.' 'ఇంతకీ అంతా ఆ ముసలాడి కర్మమమ్మా! ఎవరేం చేస్తారు ! !' అని విదలించుకుంటూ పోలమ్మ తీర్పు చెప్పింది. చీపురు ఊపుకుంటూ వెళ్ళిపోయింది.

తను ఉత్సాహంగా అమ్మదగ్గరకు పోయి అన్నది:

'తాతతో చెప్పిరానాఅమ్మా,పగడాలు దొరికాయని'

అమ్మ కంగారుగా పగడాలు పమిటకు వత్తుకుంటూ చీవాట్లుపెట్టింది: 'ఛీ! సొమ్ము ఇంట్లోనే ఉంచుకొని వాడిని ఉత్తినే హింసపెట్టామని నలుగురూ అనుకోరూ ? ఎంత అప్రతిష్ట ! !'

తన కేమీ అర్థం కాలేదు. కారణం లేకుండానే దొంగ తనంచేశాడని అపవాదు వేసి బాధపెడితే తాతకి ఏమీ అవ మానం, అమర్యాదలేదు. కాని దొరికిన వస్తువు దొరికిందని చేసిన తప్పు ఒప్పుకోవడం తమ కెంతో అమర్యాద! అప్రతిష్ఠ!

పగడాలు దొరకగానే అమ్మ తాతని పిలిచి అతని రూపాయలు అతని కిచ్చివేస్తుందనుకున్నది తాను. కాని, అల్లాజరుగలేదు. పైగా, పోలమ్మకికూడా ఏంచెప్పిందోఏమో, అసలు పగడాలు దొరికాయన్నమాటే బయటికిరాలేదు. తన మనస్సులో మాత్రం ఏదో తీరని బాధ అల్లానే నిలిచి పోయింది. అతనికి తమచేసిన తీరని అన్యాయం, అతని చెమటచుక్కలతో లెక్కపెట్టి తీసుకున్న రూపాయలు హృదయంలో శాశ్వతంగా ఏదో భారంగా వుండిపోయినవి.

చాలా రోజులవరకు తాత ఈ అఘాయిత్యంనుంచికోలు కోలేదు. అవమానంతో రోజు రోజూ కృంగి కృశించి పోయాడు. వ్యాపారం బొత్తిగా పడిపోయి క్రమంగా దుకాణమే ఎత్తేశాడు. సీత కొంచెం ఎదిగి పనికి పోతుండేది. దాంతోటే వాళ్లు ముగ్గురూ, ఎల్లాగో కాలం గడుపుకుంటూ వుండేవాళ్ళు.

ఎన్నోసార్లు, తను డాబామీద నుంచునివుంటే గుడిసె గుమ్మందగ్గరనుంచి సీతా, తాత ఇద్దరూ తనకేసి ఎంతో జాలిగా, ఆప్యాయంగా, దీనంగా చూస్తుండేవాళ్లు. తను సిగ్గుపడి కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపొయ్యేది.. ఆఖరుకి తమకు ఆ ఊరునుంచి వెళ్ళిపొయ్యేటప్పుడుగూడా, బండి పోతుంటె, తాత వాకిట్లోకి వచ్చి తనకేసి ఎంతోసేపు చూశాడు—ఎంతో మమకారంతో, కన్నీళ్ళతో, పాపం; అంత బాధపడినా తనని మరచిపోలేదు.

ఆ కన్నీళ్ళతో తనని ఏమని ఆశీర్వదించాడో! అతని అమాయకపు ప్రేమ నీడలా తన హృదయాన్ని చుట్టుకొన్నది. తనని కాపాడింది.

ఎన్ని రోజులు గడచినా, ఎన్ని మార్పులు వచ్చినా, తను మాత్రం ఎప్పుడూ తాతని మరచిపోలేదు. మెళ్ళో ఆ పగడాలు కదలినప్పుడల్లా తాత జ్ఞాపకంవస్తూనే వుంటాడు. ఎన్నోసార్లు, తాతఋణం తీర్చుకోవాలని తాపత్రయపడింది. కాని, అమ్మకు జడిసి, మొహమాటంకొద్దీ ఏమీ చేయలేక పోయింది.

మఱ్ఱిచెట్టు ఊగి, చల్లగాలి తిరిగింది. క్రిందనుంచి అమ్మ కేకేసింది: 'అన్నానికి వస్తావా! నాన్న వచ్చారు!'

మెల్లిగా లేచి. పాపకి దుప్పటికప్పి, క్రిందకు వెళ్ళింది. భోంచేస్తూ, అమ్మని అడిగింది:

'మన ఇంటికెదురుగా ఉండేవాళ్ళు-ఆ ముసిలితాతా, సీత వాళ్లు ఏమైనారమ్మా?'

అమ్మ ముఖం చిట్లించుకున్నది. 'ఏమో! ఎప్పుడో నాలుగేళ్లక్రిందట కాటకం వచ్చినప్పుడు ఆ ముసలాళ్ళిద్దరూ పోయారట. ఆ తరువాత వాళ్ళ చుట్టమెవడో వచ్చి సీతను తీసుకుపోయాట్ట. ఎక్కడుందో! ఏమో!' అన్నది. అబ్బ! తనకి గుండె పగిలే విషయంలో అమ్మకి ఎంత నిర్లక్ష్యం!!

తనకి అన్నం సయించలేదు. గబగబా రెండు మెతుకులు తిని మళ్లీ డాబామీదకు వెళ్ళిపోయింది. వెనకాల అమ్మ అరుస్తూనే వుంది:

'అదేమిటే ! అన్నమే తినలేదు !!' అని.

ఎడమచేత్తో ఇంకా రబ్బరుబొమ్మని గుండెల కదుము కుని పాప హాయిగా, అమాయకంగా, నిశ్చింతగా, నిద్దుర పోతోంది—తనకి కళ్లనీళ్ళు తిరిగాయి — మంచంమీద కూర్చుని, ముందుకువంగి పాప ముంగురులు సరిదిద్దింది. మెడలో పగడాలు ముందుకు వ్రేళ్ళాడి పాప పెదవులని తాకాయి—ఆ వెన్నెలరాత్రి, ఆకాశాన ఏ మూలో ఓ చుక్క రాలిపోయింది.

పాపకళ్లల్లోకి చూస్తో, తనకి నిద్దరతూగింది. గుండెల్లో బరువుగా కొట్టుకున్నాయి పగడాలు !!

# నిద్రలేని రాత్రి

ప్రపంచమంతా హాయిగా నిద్రపోతుండగా తను మాత్రం మేలుకొని ఉండడం ఎంతబాధ!— అందులో, ప్రక్కన మనిషి హాయిగా గుర్రుపెడుతూ ఉంటే...

ఆవేళ రాత్రి నాటకానికి వెళ్ళారు. నాటకంచూస్తూ వచ్చిన తలనొప్పి ఇంకా పోనేలేదు... ఏమి నాటకం! 'బెని ఫిట్ షో' అట!

చాతా వాతా కానివాళ్ళంతా నాటకాలాడి, హాయిగా బ్రతుకుతున్న వాళ్ల నెత్తిన రుద్దకపోతే ఏమో! ఊరికే, 'ధర్మమని' అడుగకూడదూ?

అబ్బా ! నిద్దరరాకపోతే ఏవేవో ఆలోచనలు వస్తూనే ఉంటాయి. తలనొప్పికితోడు ఈ ఆలోచనలతో మెదడు దిమ్మెక్కిపోతుంది.

ఏవేవో పిచ్చి ఊహలు.

ఆ రోజంతా జ్ఞాపకంవస్తుంది ! తను అసలు ఆ నాట కానికి వెళ్ళాలనుకోలేదు. ప్రొద్దున్నే మాలతి వచ్చింది. 'ఏమండీ! ఇవ్వాళ మా కాలేజీలో నాటకంవేస్తున్నాం. బెని ఫిట్ షో! మీరు తప్పకుండా రావాలి!'

'ఓ! అల్లాగే! అల్లాగే!' అంటున్నా రతను, అనవస రంగా గట్టిగా నవ్వుతూ.

లిప్‌స్టిక్కూ, జార్జెట్టు చూ స్తే ఈ మగవాళ్లకు ఉన్న మతి కూడా పోతుంది.

'రెండు పాతిక రూపాయల టిక్కెట్లు ఇస్తున్నానండి' అని మాలతి—

వంటఇంటిలోనుంచి వింటూఉన్న తనకు గుండెలో రాయి పడినట్లయింది. ఎంత మాటచాతుర్యం చూపినా, అధికారం చెలాయించినా, భార్యదగ్గరే! పరాయి స్త్రీలను చూస్తే, మంత్రముగ్ధులైనట్టు పెదవి కదపలేరు! మొదలకుండా తీసుకొని ఊరుకుంటారు కాబోలు! ఏంచేస్తారో అనుకుం టూండగానే, భర్త లోపలికి వచ్చారు.

'చూడు! జానకీ!! మాలతి వచ్చింది'

'ఆ! అంతా వినపడింది. ఇవ్వాళ వేరే పని ఉంది, రావడానికి ఏమాత్రం వీల్లేదు. ఏం అనుకోవద్దు, అని చెప్పి పంపివెయ్యకూడదూ! పోనీ నేను చెప్పనా?'

'అబ్బే—పాపం! చిన్నబుచ్చుకోదూ?'

'ఐతే ఏం చేద్దాం మరి?'

'నీదగ్గర ఉన్న ఏభై రూపాయలు ఇవ్వరాదూ? నీ చీర తరువాత కొనుక్కోవచ్చు. చీర కిప్పుడు తొందరలేదుగా!'

—ఎన్నాళ్ళనుంచో ఆ చీర కొందామనుకోవటం! మొగమాటం కొద్దీ ఇబ్బందిపడటమూ!

—ఏది వచ్చినా తిరిగి తిరిగి తన నెత్తినే పడుతుంది. కాదంటే అతను బాధపడుతాడేమోనని అన్నింటికి తనే సర్దుకు ఊరుకుంటుంది. ఎన్నాళ్ళనుంచి ఆ గులాబీచీర కొనాలని ప్రయత్నం! అతనికి ఆ రంగు ఇష్టం లేదు అసలు. అందుకనే, ఎప్పుడూ ఏదో వంకతో అది వెనక్కు వెళుతూనే ఉంటుంది.

'సరే! మీ యిష్టం. కాని, ఒక్క టిక్కెట్టే కొనండి. నేను రావడానికి వీలులేదు. సుబ్బలక్ష్మమ్మగారితో ఇవ్వాళ సినిమాకి వస్తానని చెప్పాను. నేను వెళ్ళకపోతే, పాపం, ఆవిడా మానుకొంటుంది.'

'ఓస్! పోనిద్దూ! ఇప్పుడు ఆవిడతో వెళ్ళకపోతేనేం చూద్దాంలే'

ఎప్పుడో ఒకసారి విశ్వప్రయత్నం మీద తప్ప, సుబ్బలక్ష్మమ్మగారికి ఇల్లు కదలడానికి అవకాశమే దొరకదు. ఇవాళ్ళ, తన మూలాన, ఆవిడ ప్రయత్నమంతా వృధా ఐంది. వస్తానని చెప్పి, రానందుకు ఏమనుకుందో!

—నాటకంలో ఉన్నంతసేపూ ఇదే ఆలోచన.

'మాలతితో తప్పకుండా వస్తామని చెప్పానుగదా, వెళ్ళకపోతే ఎలాగ' అని అతనివాదన.

మరి, తనూ, సుబ్బలక్ష్మమ్మగారితో 'తప్పకుండా వస్తానని' చెప్పిందిగా! అది ఫరవాలేదేమో! సుబ్బలక్ష్మమ్మ చదువుకోలేదుగా---ఆవిడతో మాట తప్పితే మాత్రం ఏం!

అసలు అతనికి తను ఆవిడతో స్నేహంగా ఉండడమే ఇష్టం లేదు. 'ఆవిడతో ఏమిటీ కబుర్లు! ఎంతసేపూ వంట యింటిని గురించేగా మాటలు!'—ఎంత హేళన!

...చదువుకున్న ఆడవాళ్ళంతా దేనినిగురించి మాట్లాడుతూ ఉంటారో! అసలు ఈ చదువుకున్న మగవాళ్ళంతా మాత్రం దేనిని గురించి మాట్లాడుతారు! ఇరవైనాలుగు గంటలూ తమ ఆఫీసు విషయాలు కాకపోతే! తనకు ఆఫీసు లేదాయె! రోజంతా తప్పనిసరిగా, వంటఇంటిలోనే కాల

క్షేపం చేస్తూ, ఇంక దేనిని గురించి మాట్లాడ కలుగుతుంది—
ఎంత చదువు చదివితే ఏం!

వీధిముఖం చూడడానికైనా తీరిక లేదే...ఐనవేళ, కానివేళ, ఎవరో స్నేహితులు దిగుతూనే ఉంటారుగా---కాఫీకి, భోజనానికి. ఎన్నిసార్లు విస్తట్లో పెట్టుకోబోయిన అన్నం ఆవచ్చినవారికి వడ్డించి, తాను మళ్ళీ వంట మొదలుపెట్టలేదు! రాత్రి తొమ్మిదింటికైనా సరే, ఎవరైనా వస్తే కుంపటి రాజేయవలసిందే గదూ కాఫీకని. ఈ స్నేహితులు కులాసాగా కబుర్లు చెప్పుకోటానికి వస్తారో లేక కాఫీకోసరమే వస్తారో! చాదస్తం!! హాయిగా భోంచేసివచ్చినవాళ్ళ చేత బలవంతంగా కాఫీ త్రాగించడం దేనికో!

మర్యాదట! మాట్లాడితే, 'నీదంతా పూర్వకాలం పద్ధతి—నీకేం తెలుసు' అంటారు. ఏం అహంభావం!!

ఆలోచిస్తో, ఆలోచిస్తో, జానకికి అతను తనను నిజంగా అన్యాయం చేస్తున్నాడేమో అనిపించింది. తనకూ ఏవో అభిప్రాయాలూ, ఊహలు కోరికలు ఉంటాయనీ, అవి ఫలించకపోతే తనకూ కాస్తో కూస్తో బాధకలుగుతుందనీ, అతనికెందుకు తోచదో!

తన ఆశలు, అభిరుచులు అన్నీ అతని భావాల కనుగుణంగా మారిపోవాలనుకుంటాడు. అతని కిష్టంలేని రంగులు కట్టగూడదు. అతనికి నచ్చని సినిమాలు చూడకూడదు; అతనికి బాగున్న పుస్తకాలే తనకూ బాగుండాలి. తనకు ఎంత ప్రియమైన పుస్తకాలైనా సరే, అతనికి నచ్చకపోతే,

చాటుగా చదువుకోవలసిందే — అతని వెక్కిరింపుకు భయపడి.

తన అభిరుచులు కొన్నైనా వేరుగా ఎందుకు ఉండకూడదో! ఇది ఎక్కువ సంస్కారమున్నదన్న గర్వమో లేక పురుషులందరికీ స్వభావసిద్ధంగా ఉండే అహంభావమో! తనకోసం అతను మారకూడదూ? అతని అలవాట్లను కొంచమైనా ఎందుకు మార్చుకోలేరో! రెండేళ్లైనా, ఈ సిగరెట్టు వాసన ఇంకా భరించలేకుండానే ఉంది — 'తల తిరుగుతోంది' అని చెప్పినా ఎందుకు వినరో!

అతనికోసం, అతని ఆనందం కోసం, తను ఎంత ఉత్సాహంతో ప్రయాసపడుతోంది! అతనికోసం, అతని ఆనందం కోసం ఎన్ని ఇబ్బందులు సహిస్తోంది!

ఎన్ని విషయాలలో, తన కిష్టంలేకపోయినా మనసు సరిపుచ్చుకుంటున్నదో, అతనికి ఎప్పటికైనా తెలుస్తుందా? తనకే తెలియదు, అసలు; — ఎప్పుడో ఇల్లాగ నిద్రరాని రాత్రి ఏవేవో ఆలోచనలు రేగినప్పుడు తప్ప.

—ఉన్నట్టుండి, గాలికి కిటికీలు తెరుచుకున్నాయి. లోపల వెన్నెల పడింది. బయట పందిరిమీదనుంచి జాజి పువ్వుల వాసన గుప్పుమంది.

వెన్నెట్లో ఆమెహృదయం కాస్త శాంతపడింది. రాత్రంతా, ఇంత మనోహరంగానే వెన్నెల కాస్తూన్నది కాబోలు! నిద్రమత్తులో ఉన్న ప్రపంచానికి వెన్నెల ఎందుకో!

ఎవరు చూచి సంతోషించను!— 'అడవిగాచిన వెన్నెల' అంటే, ఇదేనేమో!

అబ్బా! నిద్రలేక తలదిమ్మెక్కింది—దూరాన మువ్వల మ్రోత — పాలవాళ్ళు ఆవుల్ని తోలుకు వెళుతున్నారు కాబోలు—

తెల్లవారవచ్చింది. అబ్బా! ఒక్క పావుగంటైనా నిద్రపడితే బాగుండును! ఈ కళ్ల మంటలు కొంచెమైనా తగ్గునేమో! లేకపోతే, తెల్లవారి పనే చెయ్యలేదు.

—'జానకీ! కాఫీ తెస్తావా?' నిద్రమత్తులోనే ఆ కోరడము! రోజూ కాఫీ కప్పు చేతికి వస్తేనేగాని అతనికి మెలుకువరాదు. ఒక్కొక్కప్పుడు, ఆమెను లేపి, కాఫీ కాచమని, తాను మళ్ళీ నిద్రపోతుంటాడు!

ఇవ్వాళమాత్రం జానకి వినిపించుకోలేదు. ఆమె కప్పుడే కొంచెం నిద్రపడుతోంది. కాని, అవతలి మంచం మీదనుంచి ఇంకా, 'కాఫీ కాఫీ!' అనే ఆర్తనాదం వినబడుతూనే ఉంది—జానకి లేచేవరకూ ఆగలేదు.

'ఊ! అమ్మా!'—పూర్తిగా మెలకువ తెచ్చుకోలేక, ఆ బాధ.

కప్పు చేతికిచ్చి, జానకి వెళ్లబోయింది.

'చూడు! ఇవ్వాళ ఆదివారం కాదూ? శ్యామలరావునీ, గణపతినీ భోజనానికి రమ్మన్నాను—ఇక్కడే పేకాడుకోవచ్చని. వంట పెందలాడే అవుతుందా!'

జానకిముఖం వాడింది—ఒక్క క్షణం మాత్రమే! మళ్ళా, మామూలు ఉత్సాహంతోనే అన్నది:

'ఓ! కాకేం చేస్తుంది—పేపరు పైకి తేనా? లేక పోతే క్రిందికి దిగి వస్తారా?'

'ఇదుగో వస్తున్నాను'

—ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ మేడదిగారు.

ఆమె నిద్రలేనికళ్ళు చూశాడు అతను. కాని, 'రాత్రి సరిగా నిద్రపట్టలేదా? వంట్లో కులాసాగా ఉన్నదా!' అని అడగాలని అతనికి తోచలేదు

'నాకు రాత్రంతా నిద్రపట్టలేదు. ఒక్కటే తలనొప్పి. వంట్లో ఏం బాగుండలేదు' అని చెప్పాలని ఆమెకూ తోచలేదు.

...నవ్వుతూ, రెండోకప్పు కాఫీ అతనిచేతి కందిం చింది జానకి.

కాఫీ తాగుతూ, అతను పేపరులోతలదాచుకున్నాడు

# తెల్లారే ముహూర్తం

ఇవ్వాళ పొద్దున్న అతను వచ్చాడు. రెండు సంపెంగ పూవులు తెచ్చాడు. ఎప్పుడో వకసారి, నాకు సంపెంగ పూవులంటె చాలా ఇష్టమని చెప్పాను. అప్పటినుంచీ, అల వాటుప్రకారం సంపెంగ పూవులు తెస్తూనే ఉంటాడు.

అతని దృష్టిలో ఆ సంపెంగపూవులకు ప్రత్యేకమైన అర్థమేమీ వున్నట్లు లేదు; నాకా పువ్వులంటే ఎందు కంత ఇష్టమో అతనికి తెలుసా?

అసలు నన్ను గురించి అతనికి ఎంతవరకు తెలుసు!

ఆమాట కొస్తే, అతన్ని గురించి నాకుమాత్రం ఏం తెలుసు? దగ్గర చుట్టం కాకపోయినా ఈ సంబంధం నిశ్చయమైనప్పటినుంచి తరచుగా వస్తూనే వున్నాడు. కాని...

♦♦ ♦♦ ♦♦

అయినా ఇవ్వాళ తలుచుకుంటె అతనితో నాకు ఏమీ పరిచయం లేనట్టే తోస్తున్నది. ఎక్కడో చదివాను:

'ఒక వ్యక్తి, ఇంకొక వ్యక్తిని గురించి ఎప్పుడూ పూర్తిగా తెలుసుకోలేడు. ప్రతివ్యక్తి తన చుట్టూ ఒక గుడి కట్టుకుంటాడు. ఆ గుడి కిటికీ ఊచల బయటనుంచి తొంగి చూస్తూ ఆ కన్పించేదే అంతా అనుకుంటాడు. కాని, పూర్తిగా ఎప్పటికీ అర్థంచేసుకోలేడు.

♦♦ ♦♦ ♦♦

ఈ అపరిచిత వ్యక్తితో నాజీవితం ఎల్లా వెళ్ళుతుంది?

ఒక్కొక్కరి మీద కారణం లేకుండానే మనకు అయిష్టత కలుగుతుంది. ఆ మనిషిని గురించి మంచిగాని, చెడుగాని, మనకు ఏమీ తెలియకపోవచ్చు. అయినా ఈ అయిష్టతకు కారణం చెప్పలేం.

◆◆ ◆◆ ◆◆

అతన్ని గురించి తలుచుకున్నప్పుడల్లా నా కెందుకో ఎటువంటి ఉత్సాహమూ కలగడం లేదు.

అతనితో నా జీవితం సవ్యంగా గడుస్తుందని నమ్మకం కుదరడం లేదు.

అయినా, అంతా నిశ్చయమైన తర్వాత, ఇప్పుడు అతని లోపాలను ఏకరువు పెట్టుకోకూడదేమో!

పిన్నికి కోపం తెప్పించకుండా ఇప్పుడు ఇందులోనుంచి తప్పించుకోలేను.

* * * *

ఒకరోజు మధ్యాహ్నం, నేను లేననుకుని, పిన్ని, రాజమ్మగారు, మాట్లాడుకుంటున్నారు.

'అంతా నిశ్చయమైనట్లేనా ?'—రాజమ్మ అడిగింది.

'ఆహా ! ముహూర్తం . నెలకూడా లేదు' అని పిన్ని చెప్పింది.

పెళ్లిపనులన్నీ అయినట్లేనా ?'

పిన్ని ఏదో అనబోయి, చటుక్కున నన్ను చూసి ఆగిపోయింది. ఇద్దరూ నవ్వుకున్నారు. ఆ ప్రసంగంతో నాకు సంబధం లేనట్లే అవతలికి పోయాను.

* * * *

పిన్ని ఈ సంబంధం చెయ్యాలని ఎంత వుత్సాహపడుతున్నదో!

వెర్రికోపం వస్తే తమాయించుకోలేదుగాని, నిజానికి పిన్నికి నామీద ఎంత ప్రేమ!

ఆవిడ మనస్సు ఎలా నొప్పించగలను?

పిన్నిమాటలు సహించినట్లే నేను ఏదైనా ఓర్చుకోగలను. నా ఊహలన్నీ నాలోనే దాచుకోగలను—ప్రపంచాన్నంతా నాలోనే ఇముడ్చుకోగలను!

నన్ను గురించి నాకు విచారంలేదు. కాని అతనికి జీవితంలో కావలసిన సంతోషాన్ని ఇవ్వగలుగుతానా?

నా మనస్సు ఏ విషయంలోనూ ఇంకా వకనిర్ణయానికి రాలేదు. ఈ సందేహావస్థలో అతని జీవితానందం నా బాధ్యతగా చేసుకుంటున్నాను. ఈ బరువు మోయగలనా!

ఏమో! ... అంతా మంచికే కాకూడదూ?

* * * *

అత్తయ్య భోజనానికి పిల్చింది. నాకు వెళ్ళాలని లేదు. అయినా అత్తయ్య కోసం వెళ్లాను. ఎందుకో, మామయ్యకన్న నాకు అత్తయ్యతోనే ఎక్కువ స్నేహం. అనకూడదు కాని మామయ్యకు ఎప్పుడూ ముక్కుమీదనే కోపం. ఏ నిమిషాన ఏమంటాడోనని హడలిపోతూనే వుంటాను.

పాపం! అత్తయ్య ఓపిగ్గా బోలెడు వంట వండింది.

కాని మామయ్యకు ఒక్కటీ నచ్చలేదు.

ఎందుకో, భోజనానికి వచ్చినప్పటినుంచీ ధుమ ధుమలాడుతున్నాడు.

'కూరలో వుప్పు తక్కువ! పులుసులో వుప్పు ఎక్కువ'— అని మొదలుపెట్టాడు.

నాకు ఒక్క మెతుకైనా తినబుద్ధిపుట్టలేదు.

కళ్లతో నవ్వుతూన్నట్టునాన్న, వడ్డిస్తూంటే అత్తయ్యకు చేతులు వణుకుతూనే వున్నవి.

ఈ వణుగుడుకు 'climax' ఏమిటో అని నేనూ భయపడుతూనే వున్నాను—ఆఖరుకి, అనుకున్నంతా అయింది. ఒక్కసారి విస్తరి విసిరేసి లేచి చక్కాపోయాడు మామ!

ఆ క్షణంలో మామముఖం తలచుకుంటే ఇంకా నాకు విచారంగానే వుంటుంది.

మనకి ఆపుకోలేని కోపం వచ్చినప్పుడు ఒక్కసారి అద్దంలో చూసుకోవాలి. ఆ నిమిషంలో ముఖం ఎంత అందవికారంగా వుంటుందో! ఒక్కసారి చూస్తే, మళ్ళీ మనకెప్పుడూ కోపం రాదు.

కాని, అత్తయ్యసంగతే చెప్పుకోవాలి. ఏమైనా తొణకదు గదా! పైగా నవ్వుతుంది!!

ఏం మనిషి! ఎల్లా నవ్వుతుంది?

'ఎప్పుడూ ఇంతే. ఎవరిమీదో వచ్చిన కోపం అంతా ఇంట్లో నామీద చూపిస్తూ వుంటారు' అని నవ్వింది.

మధ్యాహ్నం ఇంటికి వచ్చేస్తూ అత్తయ్యను అడిగాను. 'మామకు కోపంవస్తే నీకు కష్టంగా వుండదూ?' అని.

'ఎందుకూ కష్టం! పదేళ్లనుంచి చూస్తున్నాను. ఇవ్వాళేం కొత్తా! అయినా ఆయనకు నిజంగా నామీదెప్పుడూ కోపంరాదు. నారయ్య శిస్తు బకాయిపెట్టాడని,

చంద్రయ్య ధాన్యం దాచేశాడని, ఈ చిరాకులన్నీ ఇంట్లోకి వస్తూవుంటాయి; అంతే' అన్నది.

పదేళ్లు! బాబోయ్!!

నేనూ అత్తయ్యలాగ వుండగలనా!

ఎందుకో, చెప్పలేని భయంవేసింది. ఇంటికి వచ్చేసరికి గేటు తీయకుండా గడియఅలాగే పట్టుకు నిలుచున్నా.

పక్క ఇంటి పంజాబీ అమ్మాయి నన్నుచూసి పక్కున నవ్వింది.

'ఏం అక్కా! ఎండ చల్లగావుందా?'

నవ్వుతూ లోపలి కొచ్చేశాను. ఆ పిల్ల నవ్వకపోతే నా గుండెబరువు మోయలేకపోదును.

ఏమి నవ్వు ముత్యాలు వలకబోస్తుంది! ఎక్కడా విచారపు ఛాయకూడా దానిని తాకదు.

—అమె కింకా పెళ్ళి కాలేదు!

* * * *

ప్రొద్దుటినుంచీ ఏమీ తోచడంలేదు..

ఇప్పటికి మూడు రోజులనుంచి శ్యామలకోసం ఎదురు చూస్తున్నాను. కాని శ్యామల రాదు. నేనే వెళ్ళి చూస్తాను. కాలేజి మానేసినప్పటినుంచి శ్యామల నాకు దూరమై పోయింది. ఇదివరకు వక్క నిమిషమైనా నన్ను విడిచి వుండ గలిగేది కాదు. ఇప్పుడు జ్ఞాపకార్థం కలుసుకోవాలని ఎప్పు డైనా కలుసుకుంటాం. మేము ఎప్పుడూ పోట్లాడుకోలేదు. అయినా మాకు తెలియకుండానే మా స్నేహం క్షీణించింది. దీనికి కారణం, ఆమెలో వున్నదో నాలో వున్నదో నేను

చెప్పలేను. కాని శ్యామలను నేను ఎప్పుడూ మరచిపోలేను. ఇవ్వాళ మళ్ళీ నా ఆలోచనలన్నీ ఆమెతో చెప్పుకోవాలని పిస్తున్నది. శ్యామలను మళ్లీ నాకు దగ్గరగా చేసుకోవాలని పిస్తున్నది.

*   *   *   *

పిన్ని పూర్తిగా పెళ్ళి పనుల్లో నిమగ్నురాలై పోయింది. బాబాయికి కూడా తీరికవుండటంలేదు. ఈ హడా విడితో నాకు ఏమీ సంబంధం లేనట్లేవుంది. నన్ను ఎవ్వరూ పలకరించరు. నా సలహా ఎవ్వరికీ అక్కరలేదు. వ్యర్థాలోచ నలతో ముందుకీ వెనక్కీ వూగుతున్నాను.

ఎందుకు ఎగురుతున్నదో ఎక్కడికి వెళ్లుతున్నదో కూడా తెలియకుండా, గాలితో కదలిపోయే ఆకులాగ వున్నది నా పరిస్థితి ...

పోస్ట్.

కస్తూరిదగ్గరనుంచీ, చంపకందగ్గరనుంచీ, రెండు వుత్తరాలు వచ్చినై-ఒకేసారి. రెండూకూడ ఏమీ ఉత్సా హకరంగా లేవు.

కస్తూరి తనఉద్యోగం ఏమీ బాగులేదని రాసింది.

'రోజురోజుకు, ఈ పని చేయలేననిపిస్తోంది. ప్రొద్దున్న మొదలు, రాత్రివరకు, క్షణం తీరికలేకుండా, పని సరిపో తోంది. సమాజాన్ని పైకి తీసుకురావాలని ఎంతో పాటు పడుతున్నాను. వక్క నిమిషం వృథా చేయడంలేదు. అయినా జీవితం ఎప్పుడూ ఏదో వెలితిగా కనపడుతోంది. ఎప్పుడూ సంతృప్తిలేదు...'

ఇక చంపకం;

... 'ఇంట్లో ఎప్పుడూ ఏదో గొడవగానేవుంటుంది. ఒక్కనిమిషం నీకు వుత్తరం రాయటానికి కూడా, విశ్రాంతి వుండటంలేదు. అన్నీ సహించుకోగలమని మొండిధైర్యం వున్నవాళ్లు తప్ప పెళ్లిచేసుకోకూడదేమో?

'చదువెందుకు మానేశానా అనిపిస్తోంది-ఇప్పుడు. మనస్సేమీ తృప్తిగా వుండటంలేదు...'

ఈ రెండువుత్తరాలు నన్ను వూరికే కలవరపెడుతున్నాయి. ఎప్పుడూ ఇంతేనా?

ఏ స్త్రీనతొక్కినా చివరకు అసంతృప్తేమిగులుతుందా?

మా పరీక్ష పూర్తయినరోజు జ్ఞాపకంవచ్చింది.

ఉన్నట్టుండి ఏదో పెద్ద బరువు తీసివేసినట్లున్నది. ఈ వారంరోజులు ఏ ఆలోచనలు మనస్సును బాధించలేదు ఏదో చీకటిగుహలో దూరి ఈ సాయంత్రమే బయటికి వచ్చినట్లున్నది. ఈలోపల ఏం చదివానో! ఏంరాశానో!

ఈ పరీక్ష నేను రాయలేదు.

వారంరోజులనుంచి ఈ సాయంత్రంకోసం ఎదురుచూస్తున్నాను. ఎందుకో! ఏంచేయాలనో?

ఇవ్వాళ తీరా పరీక్షల బెంగ వదిలేసరికి ఏదో భరించలేని వెలితి క్రమ్ముకొన్నది.

కాలేజీనుంచి వస్తూ చంచల, కమల అందరూ గలగలా వాగారు. అందరూ వాళ్లు ఇకమీద ఏమి చేయదలచుకొన్నదీ, వాళ్ల ఆదర్శాలు, నిశ్చయాలు అన్నీ గబగబా చెబుతోవుంటే విస్తుపోయి విన్నాను.

కమల నా దగ్గరగా వచ్చి అడిగింది.

'పరీక్ష ప్యాసవుతే ఏం చేస్తావు?' అని

'నాకు తెలియదు' అని చెప్పాను. అందరూ నవ్వారు.

కాని నేను నిజమే చెప్పాను. ఆవిషయాన్ని గురించి నేను ఎప్పుడూ ఆలోచించుకోలేదు. జీవితంలో ఏంచెయ్యాలను కుంటున్నానో కూడా ఎప్పుడూ ఆలోచించుకోలేదు.

నాకు పెళ్ళిచెయ్యాలని మా పిన్ని ఆరు నెలల క్రిందటే సంబంధం నిశ్చయించి పెట్టింది. ఈ సంగతి ఎవరితోనూ చెప్పకోలేదు. ఈ పెళ్ళి నాకు ఇష్టమూ అయిష్టమూ అని కూడా ఎప్పుడూ ఆలోచించుకోలేదు.

ఇవాళ ఇవన్నీ తలుచుకుంటె భయంవేస్తోంది. జీవితంలో మనం ఏంచెయ్యాలని భగవంతుని వుద్దేశమో? ఎవరైనా చెపితే బాగుండును. దేవుడు మనకు జీవితాన్నిస్తాడు. దీనితో ఏమిచెయ్యాలో చెప్పడు.

పుట్టినప్పుడే మనముఖాన ఈ విధంగా వుండాలని ఈ మార్గంలో నడవాలని ముద్రవేసి వుంచితే! అద్దంలో అది చదువుకుంటూ ఆ మార్గాన్నే అనుసరించవచ్చు.

అప్పుడు జీవితంలో సుఖం లేకపోవచ్చు, కాని తప్పుత్రోవ యేమోనన్న భయంవుండదు. హృదయంలో ఆనందం లేకపోవచ్చు, అసంతృప్తి వుండదు.

కాని నిజానికి మనకు తెలియకుండానే ఈ జీవనది భగవంతుని ఇచ్ఛానుసారమే ప్రవహిస్తున్నదేమో! లేకపోతే ఈ ఒడిదుడుకులు, ఈ మెరక పల్లాలు, వీటిని సరిదిద్దడానికి మన కేమిశక్తి వున్నది! * * *

సాయంత్రం శ్యామలను చూడడానికి వెళ్ళాను. ఊరికే నా మనస్సు క్షోభపడుతున్నది. ప్రతివాళ్ళూ, పెళ్ళికి ముందు యిలాగే బాధపడతారా? లేక ఈ బాధ నా వంతు మాత్రమేనా?...

నేనేమీ ఆలోచించుకోలేను. శ్యామలకు అంతా చెప్పి, ఆమెతో నా బాధ పంచుకొని, నా జీవితం నిర్ణయించి పెట్టుమని అడగాలనుకున్నాను. ఒక్కొక్కప్పుడు స్నేహ మెంత అవుసరమవుతుందీ?

కాని తీరా వెళ్ళాక ఒక్క మాటైనా మాట్లాడలేక పోయాను.

వెళ్ళగానే 'ఇదేమిటి! పెళ్ళికూతురు ఇల్లు కదిలిందే ... పెళ్ళికొడుకు పెద్ద ఇంజనీర్ కాబోతున్నాడుటగా! ఇంక మేము జ్ఞాపకముంటామా!' అంటూ వెక్కిరించటం మొదలు పెట్టింది.

ఇంక ఆమెతో నేనేమీ చెప్పలేకపోయాను. కాస్సేపు అర్థంలేనిమాటలు మాట్లాడి వచ్చేశాను. ఎప్పుడూ శ్యామల కళ్ళల్లో, లేని స్నేహాన్ని వెతుక్కుంటాను.

మనం వూహించుకున్నదానికీ, వాస్తవానికీ ఎంత వ్యత్యాసం ఉంటుంది!

* * * *

ఇంటికి వచ్చాక చాలాసేపు బాబాయితో మాట్లాడుతూ కూర్చున్నాను. ఆయనతో ఎంతసేపయినా మాట్లాడుతూ వుండాలనిపిస్తుంది. ఆయన ఏ విషయాన్నిగురించి మాట్లాడినా, ఏదోవిధంగా మనశ్శాంతి కలుగుతుంది. ఆయన

పట్టుదల లేకపోతే నాకీ చదువు వచ్చివుండకపోను. పిన్నికీ, బాబాయికీ మధ్య ఎంత తేడా!

*　　　*　　　*

దీపాలు పెట్టాక యెవరికీ తెలియకుండా గుళ్ళోకి వెళ్ళాను.

భగవంతునికి మొక్కుకున్నాను: 'భగవాన్! ఈ జీవితం నీది. సుఖమైనా, దుఃఖమైనా, నీ చేతులలోనుండి వచ్చినదేనని భరిస్తాను. నావల్ల ఎవరికి అణుమాత్రమైనా బాధ కలుగకుండా చూచుకుంటాను.'

ఆ నిమిషంలో నాలో గొప్ప శాంతి కలిగింది. ఆ అనుభూతి వర్ణించలేను.

రేపు ఇల్లువిడిచి వెళ్ళుతాను.

బాబాయి నన్ను దగ్గరకు పిలిచి నా తల నిమురుతూ అన్నాడు: 'ఇప్పటికి నీభారం వదుల్చుకుంటున్నాను. అతను చాలా మంచివాడు. ఇంక నిన్నుగురించి నాకేమీ విచారం లేదు.'

నాకు కళ్ళవెంబడి నీళ్ళు తిరిగాయి. కనబడకుండా తుడిచేసుకున్నాను.

# పాలపొంగు

తలదువ్వుకొని ఒదులుగా ముడివేసుకొంది. ఆశకొద్దీ తలకుమించినపువ్వులు పరచినట్లు పెట్టుకొంది. ఆ ముడీ, ఆ పువ్వులూ- పురివిప్పిన నెమలిపింఛంలా వున్నది. అదేదో సినిమాలో నర్గీస్ అలాగే చుట్టుకొన్నది.

అద్దంలో చూసుకున్నది. ఒకసారి, రెండుసార్లు,తదేక ధ్యానంతో -చాలాసేపు... ఎంత అందంగా వున్నది తాను నిజంగా నర్గీస్‌లాగే!

గడియారం ఆరు కొట్టింది.

తొందరగా కిటికీదగ్గరకు వెళ్ళి ఎదురింటి మేడ కేసి చూసింది. మేడమీద గది తలుపులు తెరిచేవున్నాయి. ఉత్సాహంతో నవ్వుకుంది.

ఆ ఇంట్లో తనూ తల్లి తప్ప, ఇంకెవరూ లేరు. తల్లికి తానంటే ప్రాణం. తనే ఆవిడ జీవితమూ, ప్రపంచమూ. ఒక్కగా నొక్కకుమార్తైన తన కేలోపమూ జరుగకూడదనీ, తండ్రిలేని లోటు లేకుండా చక్కగా అన్ని విద్యలూ నేర్పించాలనీ, ఆవిడ ఇల్లూ వాకిలీ అన్నీ వదలుకొని, తనకోసం, ఈ పట్నవాసం కాపురం వచ్చింది. తను స్కూలునుంచి ఇంటికి వచ్చి, స్నానంచేసి శృంగారించుకొని, తీరికగా వుండే టప్పటికి తల్లి వంటప్రారంభించి.అందులో మగ్నమైపోతుంది. తనకు ఒక్కర్తెకూ ఏమీ తోచదు. బెంగగా వుంటుంది.

అదృష్టవశాత్తు నాలుగైదు నెలల క్రిందట, ఎదురింటి మేడ గదుల్లోకి ఓ అబ్బాయి అద్దెకు వచ్చాడు. ఆ తరువాత తను రోజూ సాయంత్రం డాబామీద తిరిగేటప్పుడు అతన్ని

ఊరికే కొంచెంసేపు ఏడిపించడం అలవాటయింది. అదే ఒక ఆట, కాలక్షేపం.

మేడమీద, ఒక్క మెట్లగది తప్ప, అంతా డాబా, ఇంటికి కుడివేపున అంతా ఖాళీస్థలం డాబా ఎక్కిచూస్తే, దూరాన వంపు తిరిగి ప్రవహిస్తూన్న కాలువ, వంతెన, పచ్చిక బయళ్లు; ఇంకా ఆవులు, గొల్లవాళ్ళు, కనుపిస్తారు. ఎడమవైపున ఎవరిదో డాబాఇల్లు వున్నది. రెండిళ్ళకీమధ్యన ఎన్నో రకరకాల చెట్లు, ఎత్తుగా డాబా గోడలకు తగులుతూ వుంటాయి. కొబ్బరి, జామ, అంటుమామిడి, నారింజ-ఎన్నో వున్నాయి. తను డాబామీద తిరుగుతూ, అప్పుడప్పుడు పిట్ట గోడ దగ్గరికి వెళ్ళి చిన్నచిన్న కొమ్మలను గుప్పిట్లోకి తీసుకుంటూ వుంటుంది. ఆకులను పువ్వులనూ తగులుతో చెట్లకి దగ్గరగా వుండడం తన కెంతో ఆనందంగా వుంటుంది.

మామూలుగా డాబామీదకు వెళ్ళింది. ఆకులు అందుకుంటూ, పాడుకుంటూ, గాలికి ఊగిపోయే చీరకొంగు సర్దుకొంటూ, ఎంతోసేపు అక్కడే వుండిపోయింది-మధ్య మధ్యన ఎదురింటివైపు చూస్తో. అతను ఏదో కొంప మునిగిపోతున్నట్లు, తలవంచుకొని తదేకదీక్షతో వ్రాసుకొంటు న్నాడు. వ్రాయకపోతే అతని బ్రతుకే ఆగిపోతుందేమో అనిపిస్తున్నది. అయినా అంత ఆదుర్దాతోనూ, తలెత్తి తనని చూడకుండా వుండలేకపోయాడు. తను నవ్వుకుంది-గర్వంతో. ఇంక అతను ఒక్క అక్షరమైనా వ్రాయలేడు. దిగులుపడుతో చిరాకుపడుతో అల్లా తనకేసి చూస్తో కూర్చోవలసిందే-నెత్తెత్తినవాడిలా.

ఎందుకో, కొన్నాళ్ళనుంచి తన కిదో పిచ్చిలా అయింది. వీధివెంబడి వెళ్ళుతున్నా, ఇంట్లో ఉన్నా అందరూ తనకేసి చూడాలి; తన అందాన్ని మెచ్చుకోవాలి; అప్పుడు తనకి తృప్తిగా వుంటుంది. ఆనందంగా వుంటుంది. అంతకు ముందెప్పుడూ తను తలెత్తి ఒకరివంక చూసి ఎరుగదు. ఒకరు తనకేసి చూడలేదని బాధపడే ఎరుగదు.

అయిదారు నెలల క్రిందట తను పుట్టినపండుగ చేసుకున్నది. తనకి పదహారేళ్ళు నిండాయని అమ్మ ఎంతో సంతోషించి, నలుగురినీ టీపార్టీకి పిలవమంది. తన స్నేహితులంతా వచ్చారు. రాజ్యలక్ష్మి, చంద్రలేఖ, సుహాసినీ, అందరూ వచ్చారు. తను తలంటుకొని కళ్ళనిండా కాటుక పెట్టుకొన్నది. కొత్తగా కొన్న నీలిమబ్బు సిల్కుచీర కట్టుకొన్నది.

ఆరోజు అంతా ఎంతో సరదాగా గడిపారు. రాజ్యలక్ష్మి వాళ్ళు తన్ను ఎంతో మెచ్చుకున్నారు. రాజ్యలక్ష్మికి తన చీర ఎంతో నచ్చింది. 'ఈ చీర ఎంత బాగుందో, మెత్తగా జారిపోతూ. ఈ చీర కట్టుకుంటే ఏదో అప్సరసలా వున్నావు' అన్నది. చంద్రలేఖ అందుకుంది: 'శ్యామలకళ్ళు బాగుంటాయి కాదూ. అచ్చంగా నర్గీస్ కళ్లలా వుంటాయి!

సుహాసిని ఏమీ మాట్లాడలేదు. రెప్పవాల్చకుండా తనని చూస్తూ కూర్చుంది - కళ్లతో తనని మెచ్చుకుంటూ.

తనకి సిగ్గేసింది. కాని, వాళ్ళు వెళ్ళిపోయాక మాత్రం ఆ విషయమే ఆలోచిస్తూ కూర్చుంది. అదేపనిగా అద్దంలో చూసుకుంది. ఆవేళ తను నిజంగా చాలా అందంగా వుంది. అప్పుడే మొదటిసారి తెలిసింది తనకి, తను అందంగా వుంటా

నని. అప్పటినుంచే తలెత్తి ప్రపంచంకేసి చూడడం మొదలు పెట్టింది. అప్పటినుంచే అందరూ తనకేసి చూడడం మొదలుపెట్టారు. ఇప్పుడు ఎవరైనా తనకేసి చూడకపోతే, తన అందాన్ని మెచ్చుకోకపోతే తనకి కోపం వస్తుంది. అయినా మగవాళ్ళు—వీళ్ళు ఊరికే దూరాన్నుంచే చూచి సంతోషిస్తే బాగుండును. ఎవరైనా దగ్గరగా వస్తే, తనకి భయంవేస్తుంది; ఏ స్నేహితులనైనా ఆసరాచూసుకొని పారి పోతుంది. ఆఎదురింటి అతనైనా అంతే! ఎప్పుడైనా తననిపల కరించాలని చూస్తే తనకి కోపంవస్తుంది. గట్టిగా 'అమ్మా!' అనేసరికి పాపం అతనే కంగారుపడి వెళ్లిపోతుంటాడు. అయితే, ఎప్పుడో ఒకటి రెండుసార్లు మాత్రమే పరిచయం చేసుకోవాలని చూశాడు.

మొదట్లో అతనికి తన ధ్యాసే వుండేదికాదు. తను ఉన్నట్లే తెలిసేదికాని అతన్నిఎల్లాగైనా ఆకర్షించాలని తనకి తోచినప్పుడే అతనూ తనకేసి చూశాడు. ఆ తరువాత ఒక్క క్షణమైనా తనని చూడకుండా వుండలేకపోయేవాడు. ఏ పనిలోవున్నా, ఎక్కడవున్నా, తను కనుపించేసరికి, అన్నీ మరచిపోయి వెఱ్ఱినాడిలా చూస్తాడు.

తనకి ఇదొక ఆటలా అయింది. పనికట్టుకువెళ్ళి అతన్ని అల్లరిపెట్టడం; అతను చదువుతున్న పుస్తకమో వ్రాసు కుంటున్న కలమో వదిలేసి తనని చూడటానికి వస్తే, తను కనుపించకుండా దాక్కోడం; అతను చిరాకుపడితే, తను చాటుగాచూసి నవ్వుకోవడమూ.

* * * *

పొద్దు వాలుతోంది. ఇంకా స్సేపటికి ఆకాశమంతా నక్షత్రాలతో నిండిపోతుంది. ఎదురింట్లో అతను చిరాకుగా అటూ ఇటూ తిరిగి తిరిగి ఇల్లువదలి వెళ్లిపోయాడు. అతని కెందుకో అంత చిరాకు. నవ్వుకొన్నది. పరధ్యాన్నంగా ప్రక్క ఇంటివైపు చూసింది. చెట్లన్నీ గుబురు గుబురుగా వున్నాయి. ఆకులమధ్యన పచ్చగా బంగారంగా మెరుస్తో పండిన మామిడిపండు కనుపించింది. తనకి నోరూరింది. ఒక్క మామిడిపండ్లు మాత్రం ఎప్పుడు చూసినా మనసు నిలుపుకో లేదు. తొందర తొందరగా పిట్టగోడదగ్గరికి వెళ్ళింది. వంగి చేయిజాపితే చాలు. పండు అందుతుంది. కోసుకోవచ్చు. కాని, మళ్లీ కొయ్యడానికి బుద్ధి పుట్టలేదు. పరాయిచెట్టు పళ్లు తను ఎందుకు కోసుకోవాలి? తనకి ఇష్టం లేక పోయింది. కాని, ఊరికేచూస్తోఊరుకోవడంకూడా బాధగానే వుంది, ఎటు వెళ్ళినా, కళ్లుమాత్రం అటువైపే వెళ్లుతున్నాయి. పచ్చగా ఆ పండే ఆకర్షిస్తోంది. ఉండబట్టలేక, ప్రక్క ఇంటివాళ్ల బాబ్బాయిని పిలిచింది.

'రామం'

వాళ్ల డాబాలో పేకముక్కలతో బ్రహ్మాండమైన మేడలు కడుతున్నాడు రామం. కదిలితే పడిపోతాయేమో నని వాడి భయం. విసుక్కుంటూ వచ్చి అడిగాడు: 'ఎందుకూ?'

'చెట్టున మంచి మామిడిపండు వున్నది. కోసుకో రాదూ?'

ఒక్క-క్షణం చెట్టుకేసి, పండుకేసి చూశాడు. మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. సాధారణంగా ఏ చెట్టున ఏ పిందెలు వున్నా వృథాగా పోనివ్వడు. కాని, ప్రస్తుతం పేక మేడలంత ముఖ్యంగా కనుపడలేదు మామిడిపండు.

తనకి నిరాశతో చిరాకేసింది. మళ్లీ, తన కెందుకని ఊరుకొంది. బాగా చీకటిపడింది. చెదరిపోతున్న మబ్బుల్లో నుంచి, సగంసగం కనుపిస్తున్నాడు చంద్రుడు. డాబామీద అంతా నిశ్శబ్దంగా నిర్మలంగా వుంది. తనకి గొంతెత్తి పాడు కోవాలనిపించింది. పాడింది: 'మనసు నిలుప శక్తిలేకపోతే...'

క్రిందనుంచి అమ్మ పిలచింది: 'ఏమే, అన్నానికి వస్తావా?'

తనకి వెళ్లాలని లేదు. రోజూ అంతే. గంటలు చూసు కుంటూ ప్రతిపనీ చేయాలంటే తనకి విసుగు. ఎప్పుడూ ఏదో లోకంలో హాయిగా వుంటే!

అమ్మ మళ్లీ పిలచింది. వెళ్లక తప్పలేదు.

భోంచేస్తూండగా అమ్మ చెప్పింది: 'రేపు స్కూలుకి వెళ్లొద్దు. కావలిస్తే సెలవుచీటీ పంపించు'

'ఎందుకూ!' అని ఆశ్చర్యంతో అడిగింది తను.

అమ్మ సందేహిస్తూ చెప్పింది: 'ఆ! ఏమీలేదు, మామయ్య కబురుచేశాడు. అప్పుడేదో సంబంధం వ్రాశాడు గదూ. వాళ్లు వస్తారట రేపు నిన్ను చూడటానికి.'

తనకి గుండెల్లో పెద్ద రాయి పడినట్లయింది. పెళ్ళి! అమ్మకి రాత్రీ పగలూ ఇదే ఆలోచన. 'నీ మెళ్లో మూడు ముళ్ళూ పడితే అంతే చాలు' అదే మాట. తనకి పెళ్ళి

అయితే అమ్మకి అన్ని బెంగలూ తీరినట్లు. జన్మసార్థకానికి అది ఒక్కటే తక్కువలా మాట్లాడుతుంది.

అమ్మ అలా అన్నప్పుడల్లా తనకి మాత్రం భయం వేస్తుంది. పెళ్ళి కావడంతోటే తనూ పెద్దదై ప్రక్క ఇంటి కామేశ్వరమ్మగారిలా అయిపోతుందేమో! ఇంక తనకేసి ఎవరూ చూడరు.

కాని, ఈ మాటు, ఆ పెళ్లివారు రానేలేదు. వాళ్లకి ముందుగానే కట్నాలు బేరం కుదరలేదు. అదీ నయమే - అందరిలా కాకుండా! ప్రతివాళ్ళూ రావడమూ, తనని గంట సేపు పిచ్చిప్రశ్నలు వేయడమూ, చివరకు డబ్బుపేచీపెట్టి వెళ్ళిపోవడమూ! తనకే అవమానంగా వుంటోంది.

నాలుగు రోజులనుంచి అతను కనుపించనేలేదు. ఇంటికి వేసిన తాళం వేసినట్లే వుంది. తనకి ఏమీ తోచలేదు. ఏదో అంతు తెలియని వెలితి! పాపం! అల్లరికి అతనిని అనవస రంగా బాధ పెట్టిందేమో! రోజు రోజూ ఏదో దిగులుపడు తున్నట్లు కనుపించేవాడు!

ఆ వేళ డాబా అంతా ఎన్నిసార్లు తిరిగిందో- వెఱ్ఱెత్తి నట్లు. ఏమీ తోచలేదు. ప్రక్కన చెట్లదగ్గర తిరుగుతో వుండగా మామిడిపండు జ్ఞాపకంవచ్చింది. రామం ఇంకా కోసుకోనేలేదు కాబోలు! వారంరోజులబట్టీ చెబుతూనే వుంది. వాడికేమో ఈమాటు తిండిమీద శ్రద్ధ పుట్టలేదు. మధ్యన తనకేదో బాధగా వుంది! ఎవరూ తినకుండా పండు వృథాపోవడం!

మళ్ళీ, రామాన్ని కేకేసింది: 'రామం!'

వా డీమాటు బొంగరాలు తిప్పుతున్నాడు, అంతు లేకుండా. 'ఎందుకూ?' అన్నాడు.

'మామిడిపండు కోసుకున్నావూ?' అని అడిగింది తను. తలెత్తకుండానే అశ్రద్ధగా జవాబు చెప్పాడు:

'ఆ'

'ఎప్పుడూ!' అని ఆశ్చర్యంగా అడిగింది తను - ఏదో పెద్ద బరువుతీరినట్లు, సంతోషంతో.

'ఇవ్వాళే; ఏం?'—ఈమాటు తలెత్తాడు.

'అబ్బె... ఏమీలేదు... చూడూ!'—సందేహిస్తోంది.

'ఏమిటీ?'

'ఎదురు మేడమీద వుండేవాడే—'

'ఆ'

'వెళ్ళిపోయాడా?'

బొంగరాలు వేసుకుంటూనే నిర్లక్ష్యంగా చెప్పాడు రామం.

'అతనా? మొన్ననే ఇల్లు ఖాళీచేసి వెళ్లిపోయాడుగా!

ఒక్కసారి జీవితంలో ఉత్సాహమంతా పోయింది. నిస్పృహ అణచుకొని, అడిగింది:

'ఎక్కడికీ!'

'ఏమో! సామాను తీసుకువెళ్లాడు!'— తనకేం సంబంధం లేనట్లు చెప్పాడు. అరిచేతిలో బొంగరం వేసుకుని సంతోషంగా అడిగాడు:

'నేను నుదుటిమీదకూడా బొంగరం వేసుకోగలను. చూస్తావా?' గర్వంగా తనకేసి చూశాడు. తను అక్కడ నించోకుండా వెళ్ళిపోయింది.

పాపం. తనమూలాన్నే అతను వెళ్ళిపోలేదుగదా! తను అతని కంట్లో కంటకమైంది. ఊరించి, ఊరించి, దూరమైంది - పరాయిచెట్టు పండులా. నవ్వుకొంది. కాని, వెంటనే జాలి, కోపమూ, దుఃఖమూ ముంచుకొచ్చాయి. అల్లరి, సరదా, పెంకితనం, అన్నీ ఒక్కసారే వదలిపోయినాయి.

చాలా రోజులకి అతను మళ్లీ కనుపించాడు. ప్రొద్దుగూకి స్కూలునుంచి తిరిగి వస్తోంది. వీధిచివరన అతడు కనుపించాడు. ఉత్సాహం ఉప్పెనలా పొంగి వచ్చింది. అప్రయత్నంగా అతన్నిచూసి నవ్వింది. అతనూ నవ్వాడు. తనే సిగ్గుపడుతూ, పలుకరించింది:

'ఆ ఇల్లు ఖాళీ చేశారా?'

'లేదే! ఊళ్ళోలేను. అంతే!' అని నవ్వుతో చెప్పాడు.

తను కంగారుపడింది. రామంమీద కోపంవచ్చింది. మళ్ళీ, సర్దుకుని, మాట్లాడింది:

'ఎప్పుడైనా మా ఇంటికి రండి'

'ఓ! రేపే వస్తాను!'

తను తెల్లబోయింది. ఎందుకంత కొంటిగా వెఱ్ఱిగా నవ్వుతాడో? తొందరగా, తలవంచుకొని వెళ్లిపోయింది. కాని చిరాకుపడదామన్నా, తనకి సంతోషమే కలిగింది.

రాత్రి నిద్రపోబోతో, దిండ్లు చాటుచేసుకుని చెప్పింది, తల్లితో, మెల్లిగా:

'అతను మనింటికి వస్తానన్నాడమ్మా — రేపు'

'ఎవ్వరే' — అర్థంకాక ఆదుర్దాపడింది తల్లి.

'అతనే; మనింటి కెదురుగా వుండేవాడూ —' అని అమాయకంగా అన్నది తను.

'ఎందుకూ ?' అని కళ్లు పెద్దవిచేసి అడిగింది అమ్మ.

'ఊరికేనే. నేను రమన్నాను.'

ప్రక్కకు ఒత్తిగిల్లి కళ్లు మూసుకుంది. తల్లి ఏమీ మాట్లాడలేదు.

ఆ రాత్రి తనని అనేక ప్రశ్నలు చుట్టుకున్నాయి. అతను మంచివాడేనా ? అమ్మ ఏమంటుందో అతన్ని చూసి? అప్పుడెప్పుడో ఎవరో పెళ్ళికొడుకు తనని చూడటానికి వచ్చినప్పుడు అమ్మ అన్నది ఎంతో సంతోషంగా:

'చాలా మంచివాడు, చదువుతున్నవాడు' — అంటూ ఇంకా ఏమిటేమిటో ! ఇప్పుడు అల్లాగే అనగలిగితే !

కలతనిద్దరలో స్వప్నసౌధాలు నిర్మించుకున్నది.

# ఒక్క రోజు

అప్పుడే తెల్లవారుతూంది:

కిటికీలోనుంచి ఒక్క వెలుగుకిరణం శాంతముఖం మీద పడింది;— శాంతకు మెలుకువచ్చింది.

అయినా, పూర్తిగా నిద్దురబద్ధకం వదలలేదు.

నిద్రకళ్ళతో కిటికీలోనుంచి బయటకు చూసింది.

నిద్దురకళ్ళతోనే మందారపువ్వులు పలుకరించాయి.

ఒక్కక్షణం ఆమెహృదయం అటువైపు ప్రశాంతంలో లీనమయింది...

* * *

ఉన్నటుండి మిన్నువిరిగి మీద పడినట్లు ఏక రణగొణ ధ్వని!

దొడ్డివైపునుంచి 'కావు కావు' మంటూ కాకుల సమూహం;

వీధివైపునించి 'బాంయ్' మంటూ కార్ల సమూహం;

బావిదగ్గర పంచమశ్రుతిలో పనిమనిషి;

వాకిలిదగ్గర మధ్యమ శ్రుతిలో కూరల మనిషి;

—అందరూ రకరకాల గొంతుకలతో 'ఇంక ప్రపంచంలో శాంతి లే' దని బృందగానం మొదలుపెట్టినారు.

ఆ గోలకు ఎవరికైనా మెలుకువవస్తుంది.

శాంతను మెలుకువతోపాటు ఆమెను నిత్యజీవితంలో బాధిస్తున్న సమస్యలన్నీ ఒక్కపెట్టున ఆవరించాయి.

ఎప్పుడూ రాత్రి, ఎప్పుడూ నిద్ర అయితేనే బాగుంటుందేమో! అప్పుడు తీరని సమస్య లేమీ వుండవు;

ఆశ, నిరాశ, అసంతృప్తి—వీటిబాధ ఏమీవుండదు.

కాని రాత్రిఅంతా వేకువకోసం, పగలంతా రాత్రి కోసం కనిపెట్టుకుని వుండటమే జీవితం.

అయినా ఇవ్వాళ ?—

ప్రతిరోజూ ఏదో మార్పు వస్తుందని వట్టిభ్రమ. అన్నిరోజుల్లాగే ఈ రోజూ గడచిపోతుంది. అంతే!—

* * *

మామూలుగానే మేడ దిగి వచ్చింది శాంత.

మామూలుగానే రమణమ్మ కూరలు బేరంచేస్తోంది.

'బెండకాయలు అరణాలకిస్తావా?'

'అదేంటండి? వీశ ముప్పావలా అమ్ముతూంటేను!'

'ఈ కబుర్లకేంలే! అరణాల కిస్తే ఇయ్యి, అరవీశ'

'అబ్బే— యిదేం బేరమండి! అన్ని మండి పోతూంటే!'

అంతే—విసుగొచ్చి తను కలుగజేసుకుని తీర్పు చెప్పేదాకా ఆ వాదన అట్లా సాగుతూనే వుంటుంది. రోజూ ఈ ఘోష లేకుండా వుండేటందుకు కూరలకు ఎంత ధర ఇచ్చినా ఇవ్వవచ్చు.

* * *

త్వరగా స్నానంచేసి తల దువ్వుకుంది.

ఇవ్వాళ రాణీ, తనూ కలిసి మల్లెతోటలోకి వెళ్ళా లనుకున్నారు.

తెల్లవారేసరికి పువ్వులన్నీ విచ్చివుంటాయి.

ప్రొద్దుటిపూట తోట ఎంత బాగుంటుందో!

ఆ పువ్వుల వాసన తల్చుకుంటేనే ఆమెకు వింతమత్తు కలిగింది.

ఏనాడు ఆమెహృదయం మల్లెపూలతో స్నేహంచేసుకుందో కాని, మల్లెపూలను చూచినప్పుడల్లా ఆమెహృదయం వుప్పొంగిపోతుంది. ...

తోటలోనికి వెళితే...

అమ్మయ్య! ...

ఒక్క గంటసేపైనా ఈ కలవరాన్నంతా మరచిపోయి విశ్రాంతిగా వుండవచ్చు...

*　*　*

బాబు వచ్చాడు.

'అమ్మా, తలనొప్పిగా వున్నదే...'

నుదుటిమీద చెయ్యివేసి చూసింది శాంత. మసలిపోతూంది.

'పడుకో బాబూ! జ్వరం వచ్చినట్లున్నది!!'

బాబును పడుకోబెట్టి డాక్టరుకు కబురుచేసింది.

'అమ్మా! ఎక్కడికీ వెళ్లకు!— ఇక్కడే వుంటావు కాదూ?'

'ఎక్కడికీ పోను బాబూ! ఇక్కడే వుంటాను!'

అక్కడే కుర్చీలో చతికిలబడింది.

ఈ జ్వరం అనుకోకుండా ఈవేళే రావాలా?

ఏమో! ఇది కాకపోతే ఇంకేదైనా అడ్డువచ్చి వుండవచ్చు.

ఎంత ప్రయత్నించినా ఈ బంధనలోనుంచి తప్పించుకోలేదు. పాపం! రాణి తనకోసం ఎదురుచూస్తూ వుంటుందేమో? ... డాక్టరు వచ్చి చూసి మందిచ్చి వెళ్ళేడు.

ప్రమాదమైన జ్వరమేమీ కాదు. సాయంత్రానికి తగ్గిపోవచ్చు.

బాబు నిద్రపోయాడు.

కాని ఈపాటికి రాణి వెళ్లిపోయివుంటుంది.

* * *

రమణమ్మ వచ్చింది:

ప్రక్కయింటివాళ్ళు మళ్ళీ నిన్నరాత్రి మన చెట్టు అరటాకులన్నీ కోసుకున్నారు!'

'పోనీలే, వారింటికి రాత్రి మళ్ళీ చుట్టాలొచ్చారేమో'

'మళ్ళీ పొద్దున్న ఎంగిలాకులన్నీ మన దొడ్లోనే పడేశారమ్మా'

రమణమ్మ ఉద్రేకం ఆగడంలేదు.

'పోనీలే. పనిమనిషిని ఎత్తమను'

ఎప్పుడూ ఇంతే. మీరు వూరుకునేకొద్దీ వాళ్ళు ఇంకా చేస్తారు.'

ఊరుకోక ఏం చెయ్యాలి! వాళ్ళతో పోట్లాడాలా! అది తనకు ఈ జన్మలో సాధ్యమయ్యే పనికాదు.

రమణమ్మ తన ఉద్దేశ్యం చెప్పేసింది.

'ఏమైనా సరే నమ్మా. ఇవ్వాళ మీరు అడిగితే అడ గండి. లేకపోతే నేను నోరు చేసుకోక తప్పదు.'

శాంత అదిరిపడింది.

రమణమ్మ అనుకున్నది మార్చడం ఎవరికీ చాతకాదు. ఆవిడ ఈ తీర్మానానికి ఫలితం ఏమిటో శాంతకు బాగా తెలుసు. ఇటు రమణమ్మ ఒక్క నోరు చేసుకుంటే అటు వారు పదినోళ్లు చేసుకోవడం, ఈ గొడవ భరించలేక ప్లీడరు గారు తనమీద విరుచుకుపడడం.

ఇది మామూలే.

'రమణమ్మా!'

ఊహుఁ! ఆవిడ అప్పుడే దోడ్లో యుద్ధం ప్రకటించింది. ఇంక ఎంత అరచినా ఆవిడకు వినిపించదు. చెవిటివాని ముందు శంఖం వూదినట్లే.

వీధిపైనుంచి ప్లీడరుగారి కేకలు వినబడుతున్నాయి.

'ఏమిటా గోల? ఇల్లా, చేపలబజారా!'

—ఇదీ వరస.

ఈ గొడవలోనుంచి తప్పించుకొని ఎక్కడికైనా పోవాలనుకుంది. కాని వంటయింటికీ కచ్చేరి సావిడికీ మధ్య వున్నది వక్కటే గది కాబట్టి అక్కడే ఆగిపోవలసివచ్చింది.

* * *

తుపాను అణిగింది.

పరధ్యానంగా ఏదో పుస్తకం చేతితో పట్టుకుంది.

తనకు తెలియకుండానే పేజీలు త్రిప్పుతున్నది.

కాని ఏమీ అర్థమయ్యేటట్లు లేదు.

'నా రేజరు బ్లేడు చూశావా?'

ఉలికిపడింది.

ఎప్పుడూ ఇంట్లో ఏమూల చూసినా రేజరు బ్లేడులే వుంటాయి. కాని ప్లీడరుగారికి కావలసినప్పుడు మాత్రం ఒక్కటీ కనబడదు! రోజూ చూస్తున్నా ఈ చిత్రం శాంతకు వింతగానే వుంటుంది.

'నాకెందుకండీ మీ బ్లేడు? ఏమన్నా కూరలు తరుక్కుంటానా?' అని మెల్లిగా అనుకున్నది. ప్లీడరుగారు బీరువాలోని పుస్తకాలన్నీ తీసి ఒక్కటొక్కటే క్రింద గిరవాటు వెయ్యడం మొదలుపెట్టేరు.

'అబ్బే! పుస్తకాల బీరువాలో ఎందుకుంటుందండీ!'

'నీకెందుకు? నీవు వెతక్కపోగా పైగా—'

మాట్లాడకుండా వెళ్ళిపోయింది... తను బ్లేడ్ వెతుక్కు వచ్చేసరికి ప్లీడరుగారు బీరువా ఖాళీచేశారు. బ్లేడ్ చేత్తో పుచ్చుకుని అద్దంముందుకు వెళ్లారు.

అమ్మయ్య!

మళ్ళీ పుస్తకం తీసుకోబోయింది.

'నా జేబురుమాలు చూశావా?'

చూడలేదు. కాని ఇప్పుడు చూడాలి. ఎక్కడ వున్నదని?

ప్లీడరుగారు సణుక్కుంటున్నారు.

'నెలకు రెండుడజన్లు కొనుక్కుంటాను. సమయానికి వక్కటయినా —'

అలమారలోని ఇస్త్రీబట్టలు, బుట్టలోని మాసినబట్టలు, అన్నీ బయటికి వచ్చినతర్వాత—జేబురుమాలు ప్లీడరుగారి జేబులోనే దొరికింది!

'నా చెప్పు లేవీ?'

చెప్పులు బహుశా మేడమీద పడకగదిలో దొరకవచ్చు. రోజూ అవి అక్కడికి ఎలా వెళుతాయో మాత్రం ఎవ్వరూ చెప్పలేరు.

ప్లీడరుగారు మొదలుపెట్టారు.

'ఎవరూ నా సంగతి కనుక్కునేవాళ్లే లేరు! కొంచెం ఇవన్నీ చూడకూడదూ, పుస్తకం చేతిలో పట్టుకొని నిద్ర పోకపోతే?'

ఇది మామూలుపాఠమే. ఇదంతా శాంతకు కంఠతా వచ్చును.

రోజురోజూ జాగ్రత్తగా వుండాలని అనుకుంటుంది.

రోజురోజూ మరిచిపోతూ వుంటుంది...

వీధితలుపు ఫెడేలుమని చప్పుడయింది.

ఇల్లంతా అరణ్యంలాగా వున్నది. చుట్టూ ఇస్త్రీబట్టలు, మాసినబట్టలు, పుస్తకాలు, న్యూస్ పేపర్లు — మధ్యన చతికిలబడింది. అవన్నీ తన్ను చూచి నవ్వుతున్నట్లు వుంది. తనకూ నవ్వువచ్చింది. ఏదో కోర్టులనీ, ఆఫీసనీ

వుండబట్టి సరిపోయింది. కాని, ఈ మగవాళ్ళు ఇరవైనాలుగు గంటలూ ఇంట్లోనే వుండేటట్లయితే!...

నవ్వుకుంటూ లేచి ఇల్లంతా సర్దుకుంది.

వెళ్ళి, బాబుదగ్గర కూర్చుంది.

ఎండ మాడిపోతున్నది. తోటలో చెట్లన్నీ ఈ యెండకు తట్టుకోలేక, తప్పించుకు పోలేక, వాడిన ముఖాలతో ఆయాసపడుతున్నాయి. చివరకు అలసిపోయి ఈ యెండలో ప్రాణాలు నిలుపుకోలేమని నిరాశతో తలలు వాల్చుకున్నాయి.

అప్పటికి సూర్యుడు దయదల్చి చల్లబడ్డాడు

* * *

మధ్యాహ్నంనుంచి రమణమ్మగారిగొంతు వాగుతూనే ఉంది.

'కొళాయిగొట్టం విరిగిపోయింది. నీళ్ళన్నీ ఇల్లంతా నిండిపోతున్నాయి.

'వంటఇల్లు చెరువులాగా వున్నది. ఒక్కసారి వచ్చి చూడమ్మా!'

స్టోరురూము తలుపు బిగుసుకుపోయింది. ఎంత తోసినా రావటంలేదు....'

'పాలన్నీ పిల్లి తాగిపోయింది. ప్లీడరుగారికి కాఫీలేదు!'

'బాబుకు జావ కావాలి. గోధుమరవ్వ లేదు!'

'నిన్నటినుంచి చిన్న వెండిగిన్నె కనబడటంలేదమ్మా — ఏమైపోయిందోకాని'

చిన్న చిన్న విషయాలను పెద్దపెద్ద సమస్యలుగా తయారుచెయ్యడం ఒక్క రమణమ్మకే చాతనవును.

అయినా ఈ చిన్న విషయాలే ఎంత బాధ — ఎంత ఇబ్బంది— కలిగిస్తాయి!

సాయంత్రం మబ్బుగా వుంటే, వర్షం కురుస్తుందేమో ననుకుంది. కాని మబ్బులన్నీ విడిపోయి వెన్నెలవచ్చింది.

డాబామీద నక్షత్రాలకేసి చూస్తూ పడుకుంది.

తెల్లవార్లూ అల్లాగే చందమామనూ, నక్షత్రాలనూ చూస్తూ గడపగలదు.

రోజూ చూస్తూన్నప్పటికీ వీటి ఆకర్షణ తగ్గదు.

అబ్బా! ఈ వెన్నెల ఎంత హాయిగా వుంది.

నీలి పట్టుచీరమీద జరీపువ్వుల్లాగ ఈ నక్షత్రా లెంత బాగున్నాయి?

'ఇక్కడున్నావా!' ప్లీడరుగారి గొంతు.

'బాబుకు జ్వరం తగ్గిందికాదూ?'

'ఆ! చెమట్లు పోస్తున్నాయి. నిద్రపోతున్నాడు'

ఏమీ తోచక ఆకాశంకేసి చూస్తూ కూర్చున్నారు —కాసేపు.

'చూడు, ప్రొద్దున్న అనవసరంగా విసుక్కున్నా'...

శాంత చిరునవ్వు నవ్వింది.

తెల్లవారేవరకూ ప్లీడరుగారు పరమశాంతమూర్తి!

'ఎందుకు నవ్వుతావు? ... చూడు! రేపటినుంచిఒక్క మాటైనా అంటే ఒట్టు.'

రేపటినుంచి !

'రేపు!' శాంతహృదయం ఒక్కసారిగా ఉత్సాహంతో ఉప్పొంగింది. తెల్లవారుతుంది. రేపు వస్తుంది. ఇవ్వాళ చెయ్యలేని పనులెన్నో రేపు చెయ్యవచ్చు. రేపు మల్లెతోటకు వెళ్ళవచ్చు. రేపు వీణ వాయించుకోవచ్చు. మరచిపోయిన పాటలన్నీ మళ్ళీ జ్ఞాపకంచేసుకోవచ్చు. ఈ ఆశతో ఆమె హృదయం తృప్తిపొందింది.

నిన్న ... ఇవ్వాళ ... రేపు ...
వీటిలో నిజంగా ఏమీ తేడా లేదు.
అయినా 'ఈవాళ' గడచిపోయిందని నిట్టూర్పు;
'రేపు' వస్తుందని ఆశ.
కాని ఈ రాత్రి, ఈ చల్లదనం, ఈ ఆశే లేకపోతే !

# ఏమి అదృష్టం!

"జమీందారుగారి భార్య నిన్ను చూడాలన్నది. మధ్యాహ్నం వెళదామా ఒకసారి" అన్నాడు సంజీవరావు, ఇంటికి రాగానే. 'నన్నా? ఎందుకూ?' అన్నది విమల - వంచిన తల ఎత్తకుండా, పిల్లవాడికి పాలు కలుపుతూ....

సంజీవరావు, తిరిగి తిరిగి, ఎక్కడా వుద్యోగం దొరకదని నిస్పృహ చేసుకొన్న వారంరోజులకు, జమీందారుగారబ్బాయి కొక ట్యూటరు కావాలని తెలియవచ్చింది. ఆశతో జమీందారుదర్శనం చేసుకున్నాడు. కోరిక ఫలించింది. చిన్నదొర కూడాకూడా తిరగటం, అతనికి బుద్ధిపుట్టినప్పుడు రెండు ముక్కలు చెప్పటంకంటె వేరే పని ఏమీ లేదు. జీతానికి లోపంలేదు. ప్రాణం కుదుటబడ్డది. రాణీ అప్పుడప్పుడు సంజీవరావుకు కబురుచేసి పిల్లవాడి యోగక్షేమాలు కనుక్కునేది. అల్లాగే సంజీవరావు కష్టసుఖాలు కూడా విచారించేది. క్రమేణా సంజీవరావుకు ఆమెయందు చాలా గౌరవం ఏర్పడ్డది. విమల రాణీగారిని చూడటానికి ఉత్సాహపడటం బదులు అడ్డు ప్రశ్నలువెయ్యటం చూసి సంజీవరావుకు చిరాకువేసింది.

'ఎందుకేమిటే, నీ మొహం! ఆవిడ అంతగా నిన్ను చూడాలని అంటూవుంటే నువ్వు—' అన్నాడు విసుగుతో.

'అదికాదండీ, నాకు మంచిచీర వకటి అయినా లేదుగదా, ఎల్లాగ అనీ.'

విమలకు ఎక్కడికైనా వెళ్లాలన్నప్పుడల్లా తనకు మంచి చీరెలు లేవని జ్ఞాపకంవస్తూ వుంటుంది. అందుకనే సంజీవ రావు ఆమెను ఎక్కడికీ తీసుకుపోనేపోడు.

'నీ పెళ్ళినాటి పట్టుచీరె వున్నదిగదా, అది చాల్లేద్దూ' అన్నాడు సముదాయిస్తూ.

'అదేమి చీరండీ! అంతా వెలసిపోయింది! కొంచెం చినిగిందికూడాను' అన్నది, మూరాము పెడుతూ.

'ఫరవాలేదులే. ఏచీర కట్టుకున్నా ఆవిడకంటె అందం గానే వుంటావు.' అన్నాడు సంజీవరావు కొంటెగానవ్వుతూ.

విమలముఖము కలువపువ్వులాగ వికసించింది. ఆమె కళ్ళల్లో సంతోషం ఉక్కిరిబిక్కిరయింది. కాని మరుక్షణమే విచారరేఖలు ముందుకు తోసుకువచ్చాయి. 'ఏమోలెండి, ఎల్లా వుంటేనేం, ఆవిడ అదృష్టం నా కెల్లావస్తుందీ'' అంది.

''సరేలే, మూడుగంటలకు నువ్వూ పిల్లలూ సిద్ధంగా వుండండి. నేను వచ్చి తీసుకుపోతాను '' అన్నాడు, అతను, మళ్ళీ కండువా పైనవేసుకుంటూ.

* * *

విమల పన్నెండింటికే మొదలుపెట్టింది ప్రయాణ సన్నాహం. అయినా, పిల్లలకు తలదువ్వి నీళ్ళుపోసి తనూ సింగారించుకునేప్పటికి మూడు కావచ్చింది. విమలకు విసుగూ విచారం ముంచుకువచ్చాయి ''ఏమిజీవితం! ప్రొద్దున లేచింది మొదలు రాత్రి పదిగంటలదాకా క్షణం తీరికలేదు. ఎక్కడికి వెళ్ళాలన్నా విశ్వప్రయత్నం కావాలి. జీవితంలో

విశ్రాంతి శాంతి. రెండూ లేవు. అన్నీ తీరని కోరికలే. ఇప్పుడు జమీందారుగారింటికి వెళ్లకపోతేనేం? తను ఆమెకంటె అందంగా వుంటుందట. — అయితేమాత్రం ఆమెకూ తనకూ సామ్యం ఏమిటి? ఆమె లక్ష్మీప్రసన్నురాలు, తను వెలిసిన చీరె, తనూ—బండిఆగిన చప్పుడు విని తలుపు తీసింది.

"రెడీగా ఉన్నారా? పోదామా?"

"ఊఁ చూడండి: ఆవిడకు చాలా గర్వమా?"

"ఛీ!, చాలా మంచి మనిషి."

తల వాల్చుకొని బండి ఎక్కింది విమల. పిల్లలిద్దరూ బండిచూసి మురిసిపోయ్యారు.

* * *

జమీందారిణిగారి పేరు గుణవతీ దేవి. ఆమే, జమీందారుగారూ ఒకరినొకరు చూసుకొని కొన్ని సంవత్సరాలవుతుంది. గుణవతి ఇప్పుడు కేవలం విలువైన వస్తువులు కొనడంతోనే హృదయాన్ని తృప్తిపరచుకోవాలని చూస్తున్నది. చీరెలూ, నగలూ సంతోషాన్ని ఇవ్వడం మానేసి చాలా రోజులైనాకూడా అలవాటుచొప్పున ఇంకా కొంటూనే ఉంటుంది. పైగా ఆమెకు అదే వ్యాపకం కూడాను. ఇవ్వాళ కూడా విమల వచ్చేసరికి ఆవిడ చీరల బేరంలోనే ఉన్నది.

'డబుల్ కలర్ చీరెలు ఇప్పుడు చాలామంది కడుతున్నారమ్మా. ఈ చీర చిత్తగించండి' అంటున్నాడు సెట్టి... విమల చీర చినుగు కనపడకుండా కుచ్చెళ్ళు సర్దుకుంటూ రాణీని సమీపించింది.

'రండి, కూర్చోండి' అన్నది సోఫా చూపిస్తూ, గుణవతి. విమల బెదురుతూ కూర్చున్నది, చీరలనుచూస్తూ. ఎంత మంచి చీరెలు! ఎంత చక్కని జరీపని! ఆ చీరెలన్నీ చూస్తూ వుంటే, తన వంటిన వెలిసిపోయిన చీరె ముళ్లు గ్రుచ్చుకుంటు న్నట్లున్నది.

గుణవతికి మాత్రం ఒక్క చీరా నచ్చలేదు. అసలు ఆమెకు కావలసినది చీరెలయితేగదా! 'ఏమీ బాగా లేవు, రేపు ఇంకేమయినా రకాలు పట్టుకురా.' అన్నది సెట్టితో.

'చిత్తం' అంటూ మూట కట్టుకొని వెళ్ళిపోయాడు సెట్టి....దాసీది టీ తెచ్చి పెట్టింది....

'టీ పుచ్చుకొంటారా' అన్నది గుణవతి. విమల గుణవతి కేసి తలెత్తిచూసింది. అందం లేకపోయినా, ఆమె ముఖంలో ఎంత ఠీవి వున్నది! ఏదో చెప్పలేని ఆకర్షణ!... కళ్లల్లో మాత్రం విచారం కనబడుతుంది.

'వద్దండీ, నాకు అలవాటు లేదు' అన్నది వినపడీ విన పడకుండా.

గుణవతి, మాట్లాడకుండా, రెండు కప్పులలో టీ పోసి పిల్లలిద్దరికీ ఇచ్చింది. చిన్నవాడు వేడి పట్టుకోలేక టీ అంతా కాశ్మీర తివాసీమీద కొంతా, తన చొక్కామీద కొంతా వలకబోసుకున్నాడు. ఖరీదయిన తివాసీ మరకైందన్న భయంతో పిల్లవాడిమీద కోపం వచ్చింది విమలకు. 'ఏమి సంతానం' అని మనస్సులో విసుక్కున్నది. గుణవతిమాత్రం, నవ్వుతూ, పిల్లవాడిని దగ్గరకు తీసుకొని పట్టురుమాలుతో

తుడిచి మళ్లీ టీ త్రాగించింది....విమలకు కొంచెం ఊపిరి సలిపింది.

'ఎప్పుడూ ఇంతే! ఎక్కడికెళ్లినా యేదో వకటి. బయట అడుగుపెట్టడానికే భయం' అన్నది విమల.

'ఫరవాలేదండీ! ఈ మాత్రానికే!!' అంటూ నవ్వింది గుణవతి.

'అది కాదండీ, నాకు వీళ్ళతో విసుగొస్తున్నది. ఒక్క నిమిషమైనా విరామంలేదు. ఎప్పుడూ నా కొంగు పట్టుకొని వదలరు' అన్నది విమల,—సంసారం గొడవల్లోకి దిగుతూ, మామూలు ధోరణిలో.

'మంచిదేగదా, మీకు బాగా కాలక్షేపం అవుతుంది.'

'సరిలేండి, వీళ్లతో ఒక్కపనీ తెమలదు.'

గుణవతి అకారణంగా నవ్వింది. 'అదీ! మీకు తీరికలేనిపని. అందునించి విసుక్కుంటున్నారు. నాకు రోజంతా ఏమీ తోచదండీ!...ఇంక మా బాబు, నే రమ్మని కబురుచేస్తేనేగాని నా దగ్గరకు రాడు. వచ్చినా, పదినిమిషాలుకూడా వుండడు. వాడికి నాదగ్గరకంటె 'ఆయా' దగ్గరే ఎక్కువ చనువు! నేను లేకపోయినా ఏమీ బాధపడడు కాని 'ఆయా' ను విడిచి ఒక్క నిమిషంకూడా వుండలేడు!' అని గట్టిగా నవ్వింది.

ఆ నవ్వులో విషాదం ప్రతిధ్వనించింది.

విమల విస్తుపోయి చూసింది: 'దాసీలూ! దాదులూ! పనిలేక ప్రొద్దుపోదట! ఎంత అదృష్టవంతురాలు!!' అనుకున్నది.

'పంతులుగారు కూడా వచ్చారా' అన్నది గుణవతి—ప్రసంగం మారుస్తూ.

'ఆ! బయట వున్నారు. నేను. వెళ్తాను, చాలా సేపైంది' అంటూ లేచింది విమల.

దాసీది పళ్లూ, తమలపాకులూ తెచ్చిపెట్టింది.

'తరుచు వస్తూవుండండి' అన్నది గుణవతి.

'అల్లాగే. కాని, నాకు ఇల్లు కదలడానికే వీలుండ దండీ. పనిఅంతా పూర్తిచేసుకొనేసరికి ఆయన ఇంటికి వస్తారు. ఏవో కబుర్లతోటి గడిచిపోతుంది. నేను లేకపోతే ఆయన కేమీ తోచదు' అన్నది విమల సిగ్గుపడుతూ. గుణవతికి కళ్లు చెమ్మగిల్లినవి.

పిల్లలు పళ్ళకోసం ఎగబడ్డారు. ప్రతిదానికీ వాచిపోవ టమే! విమలహృదయం అవమానంతో, దుఃఖంతో క్రుంగి పోయింది. కళ్లల్లో నీరు నిండింది.

గేటు దాటుతూ భర్తతో 'ఎంత నిదానమైన మనిషి! ఏ కొరతా లేదుగదా! ఏమి అదృష్టం!!' అన్నది కళ్లు తుడుచుకుంటూ.

'ఎంత అందంగా వున్నది! చిలకాగోరువంకలలాగా వున్నారు. ఏమి అదృష్టం' అనుకున్నది గుణవతి,—కిటికీ లోంచి చూస్తూ...కన్నీటిధార ఆపుకోలేకపోయింది.

# రూపాయి విలువ

దంతపు భరిణె తెరచాడు.

ఒకసారి చేతిలోకి తీసుకొని అటూ ఇటూ త్రిప్పి చూచాడు—తృప్తితో, మందహాసంతో, స్పర్శసుఖం అను భవిస్తూ; ఒక్క—రూపాయ!

అతని జీవితలక్ష్యం, జీవిత సమస్యలూ అన్నీ ఆ ఒక్క— రూపాయ చుట్టూ తిరుగుతూన్నట్లు ఎంత ప్రాణప్రదంగా చూచుకుంటున్నాడో! ఎన్నాళ్ళనుంచో!

...ఆ రోజులు వేరు.

అడిగినవారికి లేదనకుండా ఇచ్చేవాడు. తన జేబు లోంచి రూపాయలు ఊరుతూ ఉన్నట్లే ఖర్చుపెట్టేవాడు.

అందరూ అతనిని ''ధర్మదాత'' అన్నారు. అతని ఔదార్యం వినూతన మన్నారు.

అతని ఇల్లు లక్ష్మీనివాసం; అతని ఇల్లాలు సాక్షాత్తు మహాలక్ష్మి అన్నారు.

నిజంగా, ఆమె ధర్మసత్రం నడిపింది.

ఆరోజులలో అతనికి రూపాయంటే లెఖ్ఖ లేదు.

ఇది నాది అనే భావం అసలే లేదు: తను అందరి కోసం ఆర్జిస్తున్నాడు. తన ఆర్జన ఖర్చుపెట్టుకోడానికి అంద రికీ హక్కు—ఉంది.

తన సొమ్ము వాడుకున్నవారు తనకు ఋణపడినారని కాని, తనకు కృతజ్ఞత చూపాలని కాని అతను ఎప్పుడూ

అనుకోలేదు; తీసుకున్న సొమ్ము వారు తిరిగి ఇస్తారని ఎదురు చూడనూ లేదు.

* * *

ఉన్నట్టుండి పరిస్థితులు మారిపోయాయి.

హఠాత్తుగా అతని వ్యాపారం పడిపోయింది. రూపాయలు ఊట ఊరడం ఆగిపోయింది.

గట్టులేక ప్రవహించిన ధార సన్నగిల్లిపోయింది.

ఇంకేముంది!

స్వేచ్ఛగా అతని సొమ్ము వాడుకొని ఆనందించిన వారంతా ఇప్పు డతనిని చూచి ముఖం చాటుచేసుకుంటు న్నారు. ప్రయత్నించి మరో త్రోవను వెళ్ళిపోతున్నారు.

అతనికి అర్థంకాలేదు.

స్వేచ్ఛగా సాగిన చేయి కుంటుపడింది.

—బాధతో అవమానంతో, నిరుత్సాహంతో కుమిలి పోయాడు;

తిరిగి కోలుకోలేకపోయాడు. ప్రయత్నించడానికి కూడా శక్తిలేకపోయింది. దినమొకయుగమైనా, ఎంత నిరుపయోగంగా గడిచిపోతున్నాయి రోజులు!

క్రమంగా. భార్య సణుగుడు ప్రారంభించింది. ఇంట్లో ఇదిలేదు, అదిలేదు అని గొణిగింది.

"అంత అశ్రద్ధేమిటి! పనులు చక్కబెట్టుకోకూడదూ" —అని మందలించింది.

చూసి, చూసి, ఒకొక్కరోజు వంటకూడా మాని వేసింది.

భార్య ఎందుకిల్లా చేస్తోందో అతని కేమీ అర్థం కాలేదు. . .ఎంత ఆలోచించినా కొత్తపరిస్థితులు అతనికి అవగాహనకాలేదు. నీరులేని చేపలా అతని హృదయం వడలి పోతోంది.

ఆరోజు ఇల్లు వదలి వెళ్ళాడు. ఏమీ తోచకుండా తిరిగి బారెడు ప్రొద్దున్నదనగా కృష్ణఒడ్డుకు చేరుకున్నాడు. దాహం తెలియలా. ఆకలి తెలియలా. వడగాలి తెలియలా.

పొంగుతున్న అలలనుచూస్తూ, అవతలి ఒడ్డున మేఘాలను చూస్తో పొలాల్లో పనిచేసే రైతులను చూస్తో అట్టే ఉండి పోయాడు నదిఅంచున.

"బాబూ! మల్లెదండలు కొంటారా? - ఇవన్నీ ఇచ్చేస్తాను" - అంటూ, ఆశగా నవ్వుతూ అడిగింది ఆరేండ్ల అమ్మాయి. గంప చంకన బెట్టుకు ఇంటికి పోతోంది.

ఆ అమాయకురాలి ముఖం చూస్తే అతని కెంతో జాలివేసింది. రెండుచేతులతో దండలు తీసుకొని కళ్ళనద్దుకున్నాడు. పైరుగాలంతా ఒక్కసారి మల్లెవాసనలతో నిండి పోయింది.

"ఇదుగో!" అని జేబులో చెయిపెట్టాడు. ఖాళీ జేబు!

అతనికి భయమేసింది: తన జేబు ఖాళీగా ఉండ వచ్చని అతనికి తోచలేదు.—దిగులుగా పువ్వులిచ్చేశాడు.

'పోనీ రేపే ఇద్దురుగాని బాబూ' అంది ఇచ్చిన పువ్వును తిరిగి తీసుకోవడం ఇష్టంలేక.

ఆమె అతనిని చూచి జాలిపడుతోందని గ్రహించాడు. తన దగ్గర ఒక్కదమ్మిడీ లేదు.

అతను పువ్వులు తీసుకోలేదు.

ఏదో అపరిమితమైన భయం అతనిని ఆవరించింది. ఆ అమ్మాయి జాలిచూపు మళ్ళీ మళ్ళీ కనబడుతోంది.

'—ఓహో! మీరా!'—ఎవరది?

'ఓహో! మీరా!......కులాసాగా ఉన్నారా'' అని పలుకరిస్తున్నాడు రామయ్య.

రామయ్య అని గుర్తించాడు కాని, జవాబియ్యలేదు. ప్రక్కనే కూర్చున్నాడు రామయ్య.

'అన్నట్టు—మీకు ఒక్కరూపాయివ్వాలండి, సేనాళ్ళైంది'—అని తెల్లని క్రొత్తరూపాయ అతని చేతిలో పెట్టాడు.

'రూపాయా! నాకా?'—అని ఆశ్చర్యపోయాడు అతను. 'నాకు రూపా యెందుకియ్యాలి!'

'అదేమిటండీ! ఆవేళ ఊరెళుతూ దారిఖర్చుకని మీ దగ్గర తీసుకోలేదండీ. మరచిపోయారు కాబోలును,'—అంటూ లేచి వెళ్ళిపోయాడు రామయ్య.

ఎక్కడో, ఎప్పుడో అతనికి జ్ఞాపకంరాలేదు.

కాని, ఎందరు ఎన్నిసార్లు తన దగ్గర తీసుకున్నారో, ఒక్కరైనా తిరిగి ఇస్తారని తను ఎన్నడూ అనుకోలేదు. అతని కాధ్యాసేలేదు. ఇప్పుడు రామయ్య ఎన్నడో తా నిచ్చిన రూపాయి ఇంత జ్ఞాపకంగా తిరిగి ఇయ్యడం ఎంతో ఆశ్చర్యమేసింది.

అతని అరచేతిలో రూపాయ తెల్లగా తళతళా మెరిసింది.

ఆ రూపాయను చూస్తూ అతనికి కలిగిన ఆనందం తన జీవితంలో ఇదివరకు ఎన్నడూ కలుగలేదు......ఎన్ని రూపాయలు అతని చేతిలోంచి ధారగా పడి దొర్లిపోలేదు!

అతని కళ్ళు చెమ్మగిల్లాయి. ప్రాణంపోయినా, ఈ రూపాయను పోగొట్టుకోను అనుకున్నాడు.

ప్రొద్దు వాలుతూఉండగా ఇంటి ముఖంపట్టాడు.

ఇల్లు చేరగానే, ఆ రూపాయను దంతపు పెట్టెలో దాచుకున్నాడు.

* * *

అతని స్వభావం పూర్తిగా మారిపోయింది. మళ్ళీ రెండు చేతులతో ఆర్జించడం మొదలుపెట్టాడు—ఎంతో ఉత్సాహంతో, ఎంతో ఆసక్తితో. కాని, అతను మునుపటి మనిషికాడు: ఒక్కొక్క దమ్మిడీ కూడబెట్టడం నేర్చుకున్నాడు. బ్రహ్మదేవుడికైనా అతని చేతిలోంచి ఒక్క రాగిపైసా రాలదు.

'ధర్మదేవత!' అని అతనిని పొగడినవారే 'పరమ లోభి!' అన్నారు.

కాని, అతను వినిపించుకోలేదు.

ఇంటి ఖర్చుకుకూడా భార్యను ఎంతో ఇబ్బందిపెట్టేవాడు. ఎక్కడ దాచేవాడో తన ఆర్జన అంతా—ఆమెకు అర్థమయ్యేదికాదు. అతని ప్రవర్తన చూచి విస్తుపోయింది· అబ్బ! ఎంత ఇబ్బందిపడుతుంది!

* * * *

ఉన్నట్టుండి దంతపు భరిణిలో రూపాయ మాయమై పోయింది.

అతను నిర్ఘాంతపోయాడు !!

జారి పడిపోయిందేమో అని అలమారంతా వెదికాడు. ప్రతికాగితం తీసి చూచాడు .ఇల్లంతా వెదికాడు.

ఆఖరికి భార్య నడిగాడు: ఈ దంతపు భరిణిలో రూపాయ తీశావా నువ్వు?—అని.

భయపడుతూ, చెప్పింది ఆమె: 'గాజులు కొను క్కున్నాను. ఎంతో బాగున్నాయి. చూడండి: ఎంత బాగు న్నాయో!'—అని చేతులు ముందుకు చాచింది.

అతను కుప్పకూలినట్టు పడిపోయాడు.

ప్రాణము పోయినా ఆ రూపాయ పోగొట్టుకో నను కున్నాడు—ఆ రూపాయతో ఆమె గాజులు కొనుక్కుంది! అతనికి నోటిమాట రాలేదు.

కోపగించుకోడానికి కూడా ధైర్యంలేదు. తన సర్వ స్వమూ పోగొట్టుకొన్నట్టు బాధపడ్డాడు.

ఆమె అతనివేదన చూచి కంట తడిపెట్టుకుంది...దగ్గ రగా వచ్చి మెల్లిగా అంది:

'ఎంతో బాగున్నాయి—గాజులు. కొనుక్కోవాలని పించింది. నాదగ్గర ఒక్కదమ్మిడీ లేదు. కొనకుండా ఉండ లేకపోయాను....మీ రింత బాధపడతారని తెలియదు'— అని, వెక్కి వెక్కి ఏడ్చింది.

ఆమె బాధచూసి అతనికి అపరిమితమైనజాలి ముంచు కొచ్చింది. తన రెండుచేతులతో ఆమె ముఖాన్ని తన ముఖానికి చేర్చుకున్నాడు. తన చెక్కిలితో ఆమె కన్నీ ళ్లొత్తి ఓదార్చాడు.

'అబ్బె! అబ్బె! ఈ మాత్రానికే! ...కాని, ఆ రూపాయ విలువ నీకు తెలియదు. సావకాశంగా చెపుతా' అన్నాడు.

* * *

ఇప్పుడు మళ్ళా అతని చేతులలో రూపాయలు ధార గట్టినవి.

వారిల్లు మళ్ళీ 'లక్ష్మీనివాసం!'

# బ్రతుకు తీపి

అమ్మ ఏదో చెపుతోనేవుంది. 'పోనీలేమ్మా, నీ వళ్ళు నయమై ఇంటికొచ్చావు. అంతే చాలు.' అంటూ ఇంకా ఏవో ఏవో...

—తను ఒక్కటీ వినిపించుకో లేదు. ప్రపంచమంతా ఒక్కసారి చలనం లేకుండా స్థాణువులా నిలిచిపోయినట్లయింది. హృదయంలో క్రమ్ముకున్న శూన్యం జగమంతా ఆవరించుకున్నది.

ఏదో ఆలోచన! 'ఇందుకోసమేనా ఇంటికి వచ్చానూ! ఇందుకేనా ప్రాణాలకోసం ఇంత పెనగులాడింది?'

మళ్ళీ మళ్ళీ ఇదే ఆలోచన గంటకొట్టినట్లు తల్లో తిరిగింది. తూలుతూ నిద్రలో లేచి నడిచినట్లు గుమ్మందాకా వెళ్ళింది. ఏదో అలవాటుగా తనకు తెలీకుండానే అన్నది:

'అమ్మా, అల్లా కొంచెం దూరం షికారు వెళ్ళివస్తాను.'

అమ్మ ముఖంలో ఎక్కడలేని ఆత్రుత, భయమూ కనుపించాయి. తన్ను ఆపాలని ఎంతో ప్రయాసపడుతున్నట్లు కనుపించింది. కాని మళ్లీ ఆపడానికి ప్రయత్నించలేదు. తను ఆగనూ లేదు.

అల్లాగే అంతులేకుండా నడుస్తూ వెళ్లింది.

అప్పుడే వర్షం కురిసి వెలసింది. వర్షాకాలంలో ఈ ఊరు ఎంత బాగుంటుందో. త్రోవపొడుగునా ఎన్నో రకరకాల పువ్వులు! చల్లగాలికి ఆనందంతో మెల్ల మెల్లగా ఊగి

పోతున్నాయి—నీటి ముత్యాలు రాలుస్తూ, ఎరుపు, నీలం, పసుపూ ఎన్ని రంగులో! దూరాన కొండలు నీలంగా ఆకాశాన్నంటుకుంటూ చుట్టూ గిరి గీసినట్లున్నాయి—నీరెండలో పచ్చికబయళ్ళు తళతళలాడుతున్నాయి. ఎంత ప్రశాంతంగా ఉంది. ఏమాత్రం జన సంచారం లేకుండా! కాని తనకు తోడుగా ఉంటుందని వెనకాలే అమ్మ లక్ష్మిని పంపుతుందేమో? వెనక్కి తిరిగి చూసింది. ఎవ్వరూ లేరు; అమ్మయ్య!

ఎంతసేపు నడిచిందో...ఇల్లాగే అంతులేకుండా నడుస్తూ వుంటే ఎంత బాగుండును! ప్రపంచమంతా ఎప్పుడూ పువ్వులతో, వర్షపు బిందువులతో, ఇల్లాగే ప్రశాంతంగా, మనోహరంగా వుంటే ఎంత బాగుంటుంది!...

క్రమంగా తను శానిటోరియమ్‌కు వెళ్లడం, ఒక రోజూ రెండు రోజులూ కాదు, ఎనిమిది నెలలు బాహ్యప్రపంచంతో సంబంధంలేకుండా బందీగా జీవితంగడపటమూ; అన్నీ ఒక్కటొక్కటిగా పూసగ్రుచ్చినట్లు జ్ఞాపకంవచ్చినాయి. అబ్బా! ఈ చల్లనిగాలికోసం, ఈ పచ్చని పువ్వులకోసం, వెన్నెలకోసం, స్వేచ్ఛకోసం, ఎంత పరితపించింది! అందరిలాగే తనూ జీవించివున్నానని, జీవిస్తున్నానని అనుకోవాలని ఎంత ఆరాటపడింది!

ఆవేళ మామయ్య వచ్చాడు. అప్పటికి తను శానిటోరియమ్‌కు వచ్చి మూడురోజులే అయింది. కాని, తనకు ఆ మూడు రోజులే మూడు యుగా లనిపించింది—తెల్లని దుస్తులతో మెషిన్లలా తిరిగే నర్సులు, నెత్తిమీద విధీ విసుగూ

లేకుండా తిరిగే ఫాను, చూసి చూసి విసుగుపుట్టింది. ఏమీ తోచక, రోజంతా కిటికీ దగ్గరే కూర్చునేది. కిటికీకి ఎదురుగానే ఎన్నో పెద్దపెద్ద చెట్లు దగ్గర దగ్గరగా పైనుంచి పచ్చని పందిరిలా వుండేవి. దూరాన బోర్డింగు స్కూలు గేటు మాత్రం కనుపించేది. రోజంతా ఎందరో పిల్లలు నవ్వుతో, అరుస్తో, అల్లరిచేస్తూ అటూ ఇటూ తిరుగుతూ వుండేవాళ్లు. ఎంత స్వేచ్ఛగా వుండేవాళ్లు! వాళ్లని చూసినప్పుడల్లా తన కళ్లు చెమ్మగిల్లేవి. మళ్లీ ఒక్కొక్కప్పుడు, తనూ వాళ్లతో తిరుగుతూవున్నట్టే వుండేది తనకు. కాని, నర్సు తనకి ఆమాత్రం స్వేచ్ఛకూడా ఇవ్వదలచుకోలేదు.

ఓరోజు మందలించింది: 'ఎప్పుడూ కిటికీ దగ్గరే కూర్చోకూడదమ్మా! చల్లగాలి నీవంటికి మంచిదికాదు.'

స్వయంగా వచ్చి కిటికీ మూసేసింది;— ఆ కాస్త ప్రపంచం దూరమైంది.

ఆవేళ మధ్యాహ్నంఅంతా ఏమీ తోచలేదు. ఉండి ఉండి ప్రక్క గదులలోనుంచి భరించలేని బాధతో మూలుగులు వినిపించేయి. తనకి పిచ్చెత్తినట్లయింది. బయట అందాన్ని, ఆనందాన్ని వెతుక్కుంటూ నలుగురితో కులాసాగా ఆడుతో, పాడుతో, ప్రపంచంలో బాధ వున్నదనే మరచిపోతుంటాం. కాని, ఇక్కడ నిరాశ, నిస్సహాయత, బాధ, నిస్పృహ, అన్నీ ప్రోగుచేసి కుప్పపోసినట్టయింది. ఆగి ఆగి వచ్చే ఈ ఆర్తనాదాలు ప్రపంచపు దుఃఖచరిత్ర, శంఖం పూరించి వినిపిస్తున్నట్లుంటుంది. అబ్బా!—ఎక్కడికో పారిపోవాలనిపిస్తుంది. వేరే ధ్యాసలేకుండా ఇక్కడే వుండడం ఎంతబాధ!

ఆరోజు సాయంత్రమే మామయ్య వచ్చాడు. వస్తూనే గది నాలుగు మూలలా చూస్తూ అన్నాడు: 'ఆయువు బాగుంటే గాయంఅంత సుఖం లేదు సుమా!' తెచ్చి పెట్టుకుని నవ్వాడు.

తెల్లబోతూ, కోపంతో అన్నది తాను:

'అదేమిటి మామయ్యా, అల్లా అంటావు?'

ఆయన అన్నాడు: 'అవునమ్మా, ఈ గదీ అదీ చూడు. ఎంత దర్జాగా వున్నదో! పైగా అందరూ ఇప్పుడు నిన్ను ఎంత శ్రద్ధగా చూస్తారు!'

ఏమి అర్థంలేని మాటలు! ఊరికే తనని ఓదార్చడానికే అంటాడేమో! ఈ గది బాగుంది; ఈ పరుపు బాగున్నది; ఇక్కడ నర్సులందరూ చాలా మంచివాళ్లు; నీకు త్వరగానే నయమవుతుంది; వచ్చినప్పటికన్నా ఎంత ఆరోగ్యంగా వున్నావు!-అబ్బా! ఎన్ని అబద్ధాలు చెప్పుతారో తన కోసం! తనని సంతోషపరచాలని ఎంత ప్రయాసపడుతారో!

అందరూ అంతే! తమ మాటలు వింటో ఈ దిక్కులేనివాళ్లంతా మోసపోతారనే వారి ఉద్దేశం.

తనకి తెలుసు తన ఆరోగ్యం బాగాలేదని. ఎంతో శ్రమపడితేనే గాని తనకి నయంకాదని! అయినా తనకి త్వరలోనే ఆరోగ్యం కలుగుతుంది! తనలోని అణువు అణువు ఆరోగ్యంకోసం పరితపిస్తోంది! తన హృదయంలో ప్రతి ఒక్క కోరికా తన ఆరోగ్యాన్నే చుట్టుకు తిరుగుతున్నది.

తనకోసం, బావకోసం తనకు తప్పకుండా నయమవుతుంది. ఎన్నిరోజులైనా బావ తనకోసం కనిపెట్టుకుని వుం

టాడు. బావకీ తనకీ పెళ్లవుతుంది. తమ జీవితమంతా పువ్వులతో నిండిపోతుంది. ఈ ఆశే తనకి ప్రాణం పోస్తోంది.

అబ్బా! ఈ జీవితాన్ని ఎంతగా ప్రేమిస్తున్నది! జీవితానికి దూరమైనప్పుడే తెలుస్తుంది జీవితం ఎంత ప్రియమైనదో! అస్తమిస్తోన్న సూర్యుడిని చూస్తో, నది అంచున బావా తనూ ప్రొద్దు వాలేవరకూ ఇసుకలో ఆడుకోవడం; వెన్నెలరోజుల్లో పడవషికారు వెళ్ళితే, చల్లగాలిలో నీళ్లు చింది తన బుగ్గలనిండా పడడం; రాత్రి సినిమానుంచి వస్తుంటే వర్షంలో బావ పట్టుకండువా తనమీద కప్పడం; ఇల్లా ఎన్నో—మధురమైన జ్ఞాపకాలు, కమ్మని తావిలాగ తన హృదయాన్ని చుట్టుకొంటున్నాయి. తనకి జీవితమందు ఆశ కలిగిస్తున్నాయి!

ఇంకా ఎన్నో—జీవితంలో అందమైనవి! రంగురంగుల పువ్వులు; సన్నని సరిగంచు వల్లెలు; మగుబాల నవ్వు; సైగల్ పాటలు; ఎడతెగని పుస్తకాలు; దూరమైనకొద్దీ మరింత ప్రియమౌతాయి! ఎన్ని రకరకాల పరిమళాలతో నింపుకొంటాయో ఈ జీవితాన్ని! బ్రతుకు తీపి ఎప్పటికీ వదలదు.

...తనకు తప్పకుండా నయమౌతుంది!

ఎంతమంది వచ్చేవారో తనని చూడడానికి శానిటోరియమ్‌లో. ఎన్నిరకాల ప్రకృతులు! కాని, ఒక్కరూ మూడు నిమిషాలకన్న ఎక్కువ కూర్చున్నట్లు జ్ఞాపకంలేదు. డ్యూటీగా వచ్చి, ముళ్లమీద ఉన్నట్లు వుండి, వెళ్ళిపోయేవారు. అవును, జీవితానందంలో మునిగి తేలేవారు మృత్యు

వుకు సమీపంగా వున్నవాళ్ళ దగ్గర ఎక్కువసేపు కూర్చోరులే! వారిని గురించి ఎక్కువ ఆలోచించలేరు! వెలివేసినట్లు తనెంత బాధపడేదో! ఎంత ఒంటరితనాన్ననుభవించేదో! ఎవరికి అర్థమౌతుందీ?

ఆఖరుకి, బావకూడా ఎక్కువగా రాలేదు. ఒక్కసారి మాత్రమే వచ్చాడు. రెండు నిమిషాలకన్న ఎక్కువ వుండలేదు. ఏవో రెండు పొడిమాటలు మాట్లాడి వెళ్ళాడు. మళ్లీ రానేలేదు. అమ్మ చెప్పేది: 'అతను నువ్వు బాధపడుతూ వుంటే చూడలేడమ్మా, అందుకని రాడు. నువ్వింకత్వరగానే ఇంటికొస్తావుగదూ!'

అవును పాపం; బావది ఎంత సున్నితమైన హృదయం! ఏమాత్రం బాధ అయినా చూడలేడు. అణుమాత్రమైనా అందవికారాన్ని సహించలేడు—మొదట బావ తరుచు ఉత్తరాలు వ్రాసేవాడు. పెద్దపెద్ద ఉత్తరాలు, ఎంతో ప్రేమతో, ఎంతో ధైర్యంచెబుతో! ఆ తరువాత క్రమంగా ఉత్తరాలే రాలేదు. అమ్మ ఎన్నో సాకులు చెప్పేది.

'అతనికి పరీక్షలటమ్మా, చదువుకుంటున్నాడట. ఏదో ఉద్యోగంకోసం తిరుగుతున్నాడటమ్మా. ఢిల్లీ వెళ్ళాడుట. వచ్చాక వ్రాస్తాడేమో!' ఇట్లాగే ఇంకా ఏవో ఏవో; తను అన్నీ నిజమనే నమ్మింది.

ఓసారి, పిన్ని తనని చూడటానికి వచ్చింది. ఎంతో ఆప్యాయంగా దగ్గర కూర్చుని ఎన్నో ప్రశ్నలువేసింది. తన కేమీ ఉత్సాహం కలుగలేదు. తనకి నయం కాకపోతే పిన్నికూతురు రజనిని బావ పెళ్ళిచేసుకోవచ్చు. కూతురి

వివాహానికీ, తన ఆరోగ్యానికీ వున్న సంబంధం ఆవిడకు తట్టకుండా వుంటుందా? ఈనిమిషంలో మాత్రం ఆమె అదే ఆలోచిస్తూవుండకూడదూ? స్వార్థాన్ని పూర్తిగా మరచిపోగలరా? తనకు నమ్మకం కలగలేదు.

'రజని కాలేజీలో చేరిందా?'

'బావ కాలేజీలోనేనా?'

ఏవేవో అర్థంలేని ప్రశ్నలువేసింది తను. పిన్ని కలవరపడింది. ఒకవేళ బావ రోజూ రజనిని కలుసుకుంటూ వుండొచ్చు.

ఎవరు వచ్చినా ఎవరు రాకపోయినా, అమ్మ, లక్ష్మి రోజూ వచ్చేవారు. తనతోపాటు ఖైదీల్లా కూర్చునేవారు. అమ్మ ఎంత శ్రమపడేది! ఎన్ని కబుర్లు చెప్పేది. మాటలతో, ప్రేమతో తనకు జీవంపోసింది. తనకు ఎల్లాగైనా ఆరోగ్యం కలగాలని అమ్మ పట్టుపట్టింది.

తూగుతూ, లేస్తూ, జీవితాన్ని గురించి కలలుకంటూ రోజులు గడిచేవి. నర్సు మాత్రం మధ్యమధ్యన మందివ్వాలనో, టెంపరేచర్ చూడాలనో, ఏదో వంకతో వచ్చివెళ్లేది. ఓరోజు నిద్రలేపి చెప్పింది:

'రేపు ఇంటికెళ్ళొచ్చు.' డాక్టరు చెప్పింది.

తనకి నమ్మకంకలుగలేదు. నిజమే! నిజంగానే! తనలో ఉత్సాహం కట్టలు తెంచుకొని ప్రవహించింది. అణువు అణువులో క్రొత్తచైతన్యం కలిగింది. ఎనిమిది నెలలకి తనకి విముక్తి దొరికింది. తనూ నలుగురిలో మనిషి ననిపించుకో వచ్చు.

ఇంటికి వచ్చినరోజే బావ వస్తాడనుకుంది. రాలేదు. రెండోరోజూ రాలేదు. మూడోరోజూ రాలేదు. తన కేదో నిరాధారంగా అగాధంలోకి కృంగిపోతున్న ట్లనిపించింది. శానిటోరియమ్‌లో ఉన్నన్నాళ్ళూ బయట జీవితమంతా ఒక మధుర స్వప్నంలా తోచేది; కాని, ఇక్కడ ఆశ, నిరాశ, ఒంటరితనం, శూన్యతా—ఇవే.

నాలుగో రోజు బావ ఉత్తరం వ్రాశాడు. తనకు వళ్ళు నయమై ఇంటికివచ్చినందుకుఎంతోసంతోషిస్తున్నాననిఅంతే

అతరువాత అమ్మ చెప్పింది: 'బావ రజనిని పెళ్ళిచేసుకుని చాల రోజులైంది.'

నిజమే! తను నమ్మలేకపోయింది. అమ్మ ఇంకా చెప్పుతూనే వుంది:

'నీకు నయం కాదనుకున్నారమ్మా. అత్తయ్య పట్టు పట్టింది. బావకు తప్పలేదు. అదీ మేనరికమే గదా అనుకున్నారు. అవును. ఎన్నాళ్ళని కనిపెట్టుకుంటారమ్మా. నీవు బాధపడతావని ఇన్నాళ్ళూ చెప్పలేదు. ఇంటికి వచ్చాక చెప్పవచ్చనుకున్నాను. పోనీలేవమ్మా. నీకు నయమైంది.అంతే చాలు.'—ఇంకా ఏవేవో—తను వినిపించుకోలేదు, బొమ్మలా నిలబడిపోయింది...

అబ్బ! ఎంత దూరం నడిచింది! ఇంక ముందుకు వెళ్ళలేకపోయింది. అలసిపోయి తిరిగి ఇంటివేపు నడిచింది.

అమ్మ తెలిసే తనకు చెప్పలేదు. తెలిసే తనని మోసం చేసింది. అబ్బా! తనకి తెలిస్తే తను నిరాశతో, బాధతో కృంగిపోతుందేమోనని, తన కింకెప్పటికీ ఆరోగ్యం కలగదనీ

భయపడిందేమో, పాపం! ఎంత మమకారమో!

అబ్బా! ఎంతసేపని నడుస్తూవుంటుంది! ఈ కాస్త దూరం గడిచిపోతుంది! మళ్ళీ ఆ ఇంట్లోకే వెళుతుంది! మళ్లీ అదే చీకటి. అదే నిరాశ!

ఉన్నట్టుండి, చల్లగాలికి రాలిన పూవొకటి ఎగిరి కాలి మీద పడింది. వంగి చేతిలోకి తీసుకుంది. ఎంత అందమైన పువ్వు! ఎంత మంచి వాసనో!

కళ్ళ కద్దుకుంది. కళ్లు చెమ్మగిల్లాయి.

ప్రొద్దు వాలుతోంది! కిలకిలమంటూ పక్షులన్నీ గుంపులు గుంపులుగా గూళ్లకు పోతున్నాయి. ఎక్కడో, ఏచెట్టుమీదో, ఏగూట్లోనో, బెదురుతూన్న కళ్లతో తల్లి కోసం ఎదురుచూసే పసికూనలు స్ఫురణకు వచ్చాయి. కళ్లు తుడుచుకుంది.

పోనీ, బావ ఎక్కడో సుఖంగా వుంటేసరి! తన కింకేం కావాలి! తను ఇప్పుడు ఆరోగ్యంగా వున్నదిగదా! తను మళ్లా చదువుకుంటుంది. యమ్. ఎ. దాకా చదువు కుంటుంది. తనకోసం అమ్మ ఎంత శ్రమపడుతుంది! ఆవిడ కోసం తను సంతోషంగా వుంటుంది. తనకే నవ్వొచ్చింది.

నిండు ప్రవాహంలో మునిగిపోతున్న వ్యక్తికూడా ఒడ్డుకు చేరడానికి పూచికపుల్లయినా దొరుకుతుందేమో నని వెతుక్కుంటాడు. తను జీవించడానికి వంకలు వెతుక్కుంటు న్నది. బ్రతికివుండడానికి ఏదో వంక కావాలి. ఏదో ఆసరా దొరకాలి. ఈ జీవితమంటే ఎంత ప్రేమో!

.. గుమ్మం ఎక్కుతో పువ్వు తల్లో పెట్టుకుంది.

# మసకతెర

ఇంటిముందు చక్కని పారిజాతపు చెట్టు. తెల్లవారే సరికి, గుమ్మంలో మంచు ముత్యాలతో మెరుస్తూ ఉంటాయి ఎన్నో పువ్వులు ఒకదానిమీద ఒకటి ఒత్తిగిల్లి పగడపు గొట్టాలలోంచి ఆకాశాన్ని చూస్తూ, ఏవో కలలు కంటున్నట్లుంటాయి.

ఆ ఇంట్లో ఆ పువ్వులను చూసి మురిసిపొయ్యేది రామారావు ఒక్కడే.

అతని భార్య కామమ్మకు ఆ పువ్వులమీద మోజు లేదు.

రోజూ వాదనే ఇద్దరికీ.

'ఎండ వచ్చేసరికి వాడిపోతాయి.'

అల్పాయుష్షు జీవులు.

ఈ క్షణిక సౌందర్యం ఎవరిని తృప్తిపరుస్తుంది ?

రామారావు వాదన వేరు:

'నూరు సంవత్సరాలు జీవిస్తేమటుకు ఆ జీవితం సార్థకమైనట్లు రుజువేమిటి ? ఒక్క క్షణం, పరిపూర్ణమైన ఆనందాన్ని అనుభవించినా, ఆ అనుభూతి ఇంకొకరిలో కలిగింపగలిగినా, ఆ జీవితమూ, ఆ సౌందర్యమూ ఫలించినట్లే. ఆ క్షణం జన్మ జన్మాలకూ మరపురానిది !'

కామమ్మ ఊరుకోదు.

'ఈ పువ్వులవలన ఏమిటి ఆనందం ? చుట్టూ గొంగళీ పురుగులు. ఆ బాధ భరించలేం.'

'నిజమే ! సుఖాన్ని అంటి పెట్టుకొని ఎప్పుడూ దుఃఖం ఉండనే వుంటుంది. అయితే బాధ కలుగుతుందని భయపడి' ఒక్క క్షణమైనాలభ్యమయ్యేసుఖాన్ని దూరంచేసుకోవాలా?

* * *

తీరికగా ఆలోచిస్తే, జీవితం చిత్రంగా వుంటుంది. సుఖ దుఃఖాలలో ఏది విలువకలదో చెప్పలేము. జీవిత పరమార్థ మేమిటో తెలిసికోలేము. అదృష్టవశాత్తు—జీవితాన్ని గురించి ఆలోచించడానికి తీరికేలేదు. జీవిస్తూ, ఆ జీవితపు సందడిలో, జీవితాన్ని గురించి ఆలోచించము. ఎప్పుడూ ఏదో అన్వేషణ,తీరని ఆతృత. ఈర్ష్యా, కోపమూ, అసంతృప్తి, జాలి, భయమూ, తృష్ణ, ఇల్లాంటివి ఏవేవో మనస్సును చికాకు పరుస్తూనే వుంటాయి.

విశ్రాంతి లేదు.

ఆనందంకోసం వెతుక్కుంటూ, ఆనందాన్ని పారవేసుకుంటాము.

ఎప్పుడో, జీవితపు విలువలను తెలుసుకోకుండానే, ఈ జీవితము ముగిస్తుందని స్ఫురించదు.

* * *

కాని, ఎప్పుడో ఒక్కసారి మాత్రం మసకతెర విడిపోతుంది. జన్మాంతర సంస్కారము ఒక్కసారి వికసిస్తుంది. దృక్పథం మారిపోతుంది. అనుకోకుండా, మృత్యుముఖం ఎదురౌతుంది—భూమి బ్రద్దలై, బ్రహ్మాండమైన లోయ ఎదురైనట్లు.

అప్పుడు మణులు వజ్రాలు అనుకొని మనం కోరి పరిత పించినవన్నీ రంగుపూసలు, చిల్లపెంకులుగా మారిపోతాయి.

*        *        *

రామారావులో ఈ మార్పు సరీగా, ఏ నిమిషాన కలిగిందో అతను చెప్పలేడు. తీవ్రమైన జ్వరంతో బాధపడు తున్నాడు. ఆవేళ డాక్టరు వుత్సాహంగావున్నా, అతనికి వుత్సాహం కలుగలేదు. ఏదో గాఢమైన నిశ్శబ్దం ఆవరిం చుకు వస్తున్నట్లుంది. అతను అనుకున్నాడు చివరిఘడియ సమీపించినదని.

ఆ తరువాత మూడు రోజులవరకూ తను ఏ లోకంలో వున్నదీ అతనికే తెలియలేదు. మగత కళ్ళతో గదిఅంతా కలయజూచేవాడు ఎన్నాళ్ళనుంచో ఆ గదికి అతను అల వాటుపడిపోయినాడు. చూడకుండానే ఏ వస్తువు ఎక్కడ వున్నదీ తెలుసు.

ఆ రోజు మాత్రం: ఆగదీ, ఆ వస్తువులూ, ఆ వాతా వరణమూ అంతా ఏదో కలలా తోచాయి.

అతని హృదయం ఎక్కడో, ఎన్నడూ ఎరుగని పచ్చిక బయళ్ళలో, సెలయేటి తీరాల్లో, ఇసుకతిన్నెల్లో విహరిస్తోంది.

కామమ్మకు అతని పరిస్థితి అర్థముకాలేదు. అయినా, తనకు తెలియకుండానే అతనిని తిరిగీ మామూలు ప్రపంచం లోకి తీసుకురావటానికి విశ్వప్రయత్నం చేసింది.

ఒక్క నిమిషం ఊరుకోలేదు.

'మందు పుచ్చుకోరూ?'

'నిద్రవస్తోందా?'

'జావతాగుతారా, లేకపోతే కాఫీ కాచనా?'

—మూడు రోజులు అతనితో పెనుగులాడింది.

మూడో రోజు జ్వరం తగ్గింది.

అతను ఆమె ప్రశ్నలకు జవాబు చెప్పాడు.

కాని, అతని ఊహాలుమాత్రం మారిపోయినవి.

ఎప్పటికైనా, చివరకు, అగాధమైన నిశ్శబ్దమే మిగులుతుందని, అతను మరువలేడు.

ఈ నిమిషాన పిడుగుపడవచ్చు; ఈ నిమిషంలో భూకంపం రావచ్చు. ఒక్క క్షణంలో తను చిన్నప్పటినుంచీ కట్టుకున్న గాలిమేడలన్నీ కూలిపోవచ్చు.

ఎంత అర్థంలేని బ్రతుకు!

అతనికి శాంతి కుదరలేదు......

చాలా రోజులకు భార్యతో అన్నాడు:

'ఒకవేళ నేను చచ్చిపోయివుంటే'—

మాట పూర్తికాకుండానే, కామమ్మ మందలించింది.

'ఛీ! ఊరుకోండి. నిండు ఇంట్లో ఏమిటా మాటలు!'

అతను మళ్ళీ ఆ మాట ఎత్తలేదు.

అవును; ఆ విషయం మరచిపోవడమే మంచిది!

లేకపోతే జీవించటమే కష్టం!

అతనుమాత్రం ఆ తరువాత ఎప్పుడూ, ఎంత ప్రియమైన వస్తువైనా, అమూల్యమైనదని కానీ, ఎంత అల్పవస్తువైనా విలువలేదనికానీ, అనుకోలేకపొయ్యేవాడు. గుమ్మంలో గొంగళీపురుగుకు ఎంత స్థానమో పారిజాత పూవులకూ అంతేనేమో!

# సెలవుల్లో

సెలవులకు ఆ వూరు వచ్చారు.

ఆయ నెవరో నాన్న స్నేహితుడట.

ఆయన తన తోటలో ఒక బంగళా ఖాళీగావుంటే వాళ్ళకు ఇచ్చాడు.

ఎంత పెద్ద తోట! ఏదో పెద్ద అడవిలావుంది! చిన్న చిన్న ఇళ్ళు. ఈ అడవిలో పడి త్రోవతప్పినట్లు ఓగంట తిరిగి తేనే కాని కనిపించవు. తను రైల్లో చదివిన కథలో రాజకుమార్తె, పాపం త్రోవతప్పి అడవిలో ఎంతో కష్టపడుతుంది.

నిజంగా అడవి ఎల్లా వుంటుందో!

ఈ తోటలాగే అందంగా వుంటుందా!

ఇక్కడకూడా ఓ పెద్ద సరస్సూ, నెమళ్ళూ లేడి పిల్లలూ, అన్నీ వుంటే ఇంకా బాగుంటుంది కాదూ!

తోటగేటుదగ్గరకొచ్చేసరికి సముద్రపుహోరు విన బడుతూవుంటుంది. గేటుకు సముద్రానికి మధ్య వీధి అడ్డం. ఒక్కర్తె అల్లా గేటుదగ్గర నుంచుని అల్లా అలల కేసి చూస్తూ వుంటుంది, రోజంతా. అంటే శివయ్య తనని వెతుక్కుంటూ వచ్చేవరకు.

ఎంత ఎత్తున లేస్తాయో, కెరటాలు! ఇంకా ఇంకా పెద్దవై గేటుదాకా వచ్చేస్తే!

'ఇక్కడున్నారండి, అమ్మాయిగారూ'

తను వినిపించుకోదు.

'చూడు, అలలు ఎప్పుడైనా గేటుదాకా వస్తాయీ?'

'ఏమోనండి, తుపానొస్తే వస్తాయి.'

'ఎప్పుడొస్తుంది తుపాను?'

'ముందర ఇంటికి పదండి.'

'పో పో. నేను రాను.'

ఊహుఁ. వాడు కదలడు, తను కదిలేవరకూ.

'మఱండి, ఓసారి మా ఊళ్ళో పేద్ద తుపాను వచ్చిందండి...'

అంతే. ఆ కథ వింటూ మరచిపోయి తను యింటిదాకా వాడితో నడిచి వెళ్ళుతుంది.

ఈ ఊరు ఎంత బాగున్నది. రాజకుమార్తె, ఈ తోటంతా అడవి. శివయ్య మంత్రిగాడు, అమ్మ రాణీ, ప్రక్క బంగళాలో మేరీ తన చెలికత్తె. మేరీ ఏవేవో ఇంగ్లీషు పాటలు పాడుతుంది, ఏడుపురాగాలతో. నా మొహం అవేంపాటలు! ఒట్టి పిరికిది. మధ్యాహ్నమప్పుడు బీచికి వెళదాం రమ్మంటే రాదు. ఆఖరుకి తోటంతా తిరుగుదామన్నా రాదు. ఎక్కడికో పోవాలి, ఏదో చెయ్యాలన్న కోరికేలేదు దానికి.

అయినా ఈ ఊరు బాగుంది.

పోయిన సంవత్సరం అమ్మమ్మగారి ఊళ్లో వున్నది. అక్కడా బాగానే ఉన్నది. అందరు తన్ను ఎంతో ఆప్యాయంగా చూశారు. అసలు నాన్న తనను అక్కడ ఉంచుతాడని అనుకోనేలేదు. ఊరికే రెండురోజులు చూసివద్దామని వెళ్ళారు. ఆ రెన్నాళ్ళలో అమ్మమ్మకీ తనకూ ఎంతో

స్నేహమైపోయింది. అమ్మమ్మ కబుర్లు చెపుతూనే తనను గురించి ఎన్నో అడిగి తెలుసుకుంది. ఎవరికీ చెప్పని సంగతు లెన్నో తను అమ్మమ్మకు చెప్పేసింది. అమ్మ ఎంతో మంచిది. కాని నాన్న అంతమంచివాడు కాదు.

'తగని కోపం అమ్మమ్మా, ఉత్త పుణ్యానికే కసురు కుంటాడు' చెబుతో తన కళ్ళునిండాయి. వింటో అమ్మమ్మ చిన్నపుచ్చుకుంది.

'పోనీ నువ్వు సెలవుల్లోనయినా ఇక్కడ ఉండ కూడదూ?'

'నాన్న వుంచడుగా.'

'నే చెబుతాలే.'

తనకేం నమ్మకం కలగలేదు. తనకు తెలుసు నాన్న వుంచడని. కాని అమ్మమ్మకు ఏదో మ్యాజిక్ తెలుసు. నిమి షంలో నాన్నను ఒప్పించింది. తనూ అమ్మా సెలవల్లో అక్కడే వుడిపోయారు.

ఆ సెలవలు అమ్మమ్మ తనూ ఎంత సరదాగా గడి పారు. తనను ఎవరూ ఏమీ అనకూడదు. అంటే అమ్మమ్మ వూరుకోదు. చిన్న మామయ్యకు తనను ఏడిపించటమంటె భలే సరదా. అస్తమానం ఏదోవకటి అని వుడికిస్తూవుండే వాడు 'అమ్మమ్మా' అనగానే మాత్రం వూరుకునే వాడు. పాపం క్లబ్బుమానుకుని తనను పార్కుకు, సినిమాలకు తీసుకు వెళ్ళేవాడ. ఆ ఇంట్లో ఎవరికీ అమ్మమ్మను చూస్తే భయం లేదు. కాని ఆమెకు అయిష్టమైన పని ఎవరూ చేయరు. పెద్దత్తయ్య వూరికే విసుక్కుంటూ వుంటుంది. మళ్ళీ ప్రతి

దానికి అమ్మమ్మను సలహా అడుగుతూ వుంటుంది. అమ్మమ్మకు అక్కరలేని విషయంలేదు. ప్రతిదీ తనకు తెలియాలి తన యిష్టప్రకారం జరగాలి ... పెద్దత్తయ్య ఎక్కువ మాట్లాడదు. కాని చిన్నత్తయ్య చాలా సరదాగా వుంటుంది. తనతో సమంగా ఆడుకునేది. పెద్దత్తయ్యకు కోపం. అమ్మమ్మ అడ్డం లేకపోతే ఎన్ని సార్లు పోట్లాడేదో చిన్నత్తయ్యతో.

పొద్దుకూకగానే అమ్మమ్మా తనూ డాబా మీద పడుకునేవాళ్లు; నవారుమంచం వాల్చుకుని బంగారంలాంటి వెన్నెట్లో చిన్ని చిన్ని మేఘాలు ఒకదానినొకటి తరుముతూ ఆకాశంతో ఆడుకుంటూవుంటే, తను చూస్తూ పడుకునేది. క్రింద అమ్మా, అత్తయ్యా చెప్పుకునే కబుర్లు ఎక్కడో ఎవరో గుసగుసలాడుతున్నట్లు వినిపించేవి. మధ్యమధ్యన దొడ్లో బాదంచెట్టు ఆకులు గాలికి గలగలమని రాలిపోతుండేవి.

అమ్మమ్మ కథలు చెప్పేది. ఎప్పుడో జరిగిన సంగతులన్నీ కథల్లాగా చెప్పేది. అవన్నీ తనకు ఎక్కడో ఇంకోలోకంలో జరిగిన సంగతులులాగా వుండేవి. నిజంగా జరిగినట్లు కూడా నమ్మకం కలిగేది కాదు. రోజూ తనే ముందర అడిగేది.

'అప్పుడేమైంది, అమ్మమ్మా?'

'ఎప్పుడు? ఎప్పుడో అరవై యేళ్ళక్రిందట అమ్మమ్మ చెబుతుంది.

'మరి, నా చిన్నతనంలో ఓసారి కరువు వచ్చింది. అప్పుడు ఎన్నాళ్లో కటికి వుపోషాలుచేశాం. ఆఖరికి ఓరోజు వుండలేక మట్టి తిన్నాము.'

'ఛీ ఛీ!'

అమ్మమ్మ వినిపించుకోదు. అల్లా తను పడిన కష్టా లన్నీ చెప్పుకుపోతూనేవుంటుంది. తను 'అమ్మో' 'అయ్యో' అంటూనే నిద్రపోతుంది. ఒక్కొక్కసారి తను ఊకొట్టుకుపో యినా అమ్మమ్మ వినిపించుకునేది కాదు. తను ప్రక్కనవున్న సంగతే మఱచిపొయ్యేది.

'అమ్మా నేను చేసిన కాపరం' అనుకుంటూ తనలో తాను ఏవేవో జ్ఞాపకం తెచ్చుకుంటూ మాట్లాడుకునేది. ఎంచేతో అటువంటప్పుడుతనుఅమ్మమ్మనుపలకరించేదికాదు. సగం సగం వింటూ అల్లాగే నిద్రవచ్చేవరకు పడుకునేది.

ఈ సంవత్సరంలో కూడా అమ్మమ్మ వాళ్ళను రమ్మని వ్రాయించింది. కాని నాన్న పంపలేదు. ఆ సెలవల తరువాత తను అమ్మమ్మను మళ్ళీ చూడలేదు; చూడాలని ఎంతో అనిపిస్తోంది.

అమ్మ అన్నది కూడాను:

'ఆవిడకు వళ్ళు బాగుండలేదుట. ఒక్కరోజైనా వెళ్లి చూసివద్దాము.' అని. కాని నాన్న ఎవ్వరిమాట వినడు. తనకు ఎంతతోస్తే అంతే. పైగా ఎందుకో నాన్నకు అమ్మ మ్మావాళ్లమీద కోపంగావుంది. అమ్మను ఉత్తరం కూడా రాయనియ్యటంలేదు. అమ్మా నాన్నా తన ఎదట ఏమీ మాట్లాడుకోరు. అయినా తనకి తెలుసు ఏదో మాటపట్టిం పులు వచ్చాయని. అంతెందుకు. పిన్నివాళ్ళు వున్న దీ వూరేగా? పిన్ని అమ్మమ్మను చూడటానికి వెళ్లింది. కాని బాబాయ్ ఇక్కడే వున్నాడుగా. ఎప్పుడూ వాళ్ళని చూడ టానికి రాలేదు. అమ్మ మాత్రం అప్పుడప్పుడూ చాటుగా

శివయ్యను బాబాయ్ దగ్గరికి పంపిస్తూందనితనకుఅనుమానం. బాబాయ్‌కి వుత్తరాలొస్తాయిగా. అమ్మమ్మ కబుర్లు ఏమైనా చెబుతాడు. పాపం అమ్మమ్మకి ఎల్లావుందో?

ఆవేళ తనకేమీ తోచలేదు. ప్రొద్దున్నే పూలకోసం తోటలోకి వెళ్లింది. దానిమ్మపువ్వులంటే తన కెంతో ఇష్టం. ఎఱ్ఱగా ఎంతబాగుంటాయో. పైకొమ్మమీది పువ్వుల కోసం కొమ్మవంచింది. పువ్వులు అందలేదు. కొమ్మ ఒరుసుకుని చేయి కందిపోయింది. తోటమాలి వచ్చి చూసి నవ్వాడు.

'కొమ్మలు వంచకూడదు. చూడు వేళ్లు ఎంత కందిపోయాయో. అసలే ఎఱ్ఱని వేళ్లు, అందులో కందిపోతే?'

నవ్వుతోనే పూలుకోసి యిచ్చాడు. చిరాకుగా తను పువ్వులు తీసుకుంది. పరుగుపరుగున ఇంటికి వెళ్ళింది. పువ్వులు వంటఇంట్లో అమ్మదగ్గర పడేసింది. మళ్లీ వాటికేసి చూడలేదు. ఆ రోజంతా చిరాకుగానే వుంది. ఏమీ తోచలేదు.

సాయంత్రం మేరీతో ఆడుకోడానికి కూడా బుద్ధి పుట్ట లేదు. నాన్న ఎవరో స్నేహితులతో సినిమా కెళ్లాడు. అమ్మ వంటచేసుకుంటోంది. తను ఒక్కత్తె దిగులుగా ముందర వసారాలో కూచుంది. శివయ్య లేడు. ఎక్కడికి వెళ్లాడు? అమ్మ బాబాయ్ దగ్గరికి పంపించిందేమో?

కాస్సేపటికి శివయ్య వచ్చాడు. ఒక్క గంతు వేసింది వాడిదగ్గరికి.

'ఎక్కడికి వెళ్లావురా?' గంపెడాశతో వాడేదో అమ్మమ్మను గురించి చెబుతాడని ఎదురుచూసింది. వాడేం మాట్లాడలేదు.

'ఏం లేదండి' అంటూ దొడ్డివైపు అమ్మదగ్గరికి వెళ్లాడు. ఏమీ చేయులేక వసారలోనే కాస్సేపు కూర్చుంది. చివరకి వుండలేక తనూ లోపలికి వెళ్లింది. అమ్మ దిగాలుపడి కూచుంది. కళ్లనీళ్లు పెట్టుకొంటూ శివయ్య బిక్కమొగం వేసుకున్నాడు. తనకు నిమిషంలో తెలిసిపోయింది, అమ్మమ్మకేదో అయిందని. ఎందుకో అమ్మమ్మ తన కింకెప్పుడూ కనుపించదని కూడా తనకు తోచింది.

అమ్మ కళ్లనీళ్ళు తుడిచేసుకుంది. శివయ్య అన్నాడు. 'రండి, అమ్మాయిగారు, మనం బీచికి పోదాం.'

తనకి వెళ్ళాలనే లేదు. తల పగిలిపోతూవున్నది. కాని అమ్మకూడా అన్నది. 'వెళ్లిరా, తల్లీ.'

ఆ మాటతో తను మెదలకుండా అక్కడనుంచి వెళ్ళిపోయింది.

మేరీ పాడుతోంది, ఏడుపు రాగంతో.

తోటంతా ఏడుస్తోంది.

మేరీని కూడా పిల్చింది. ముగ్గురూ సముద్రం ఒడ్డునే నడిచి వెళ్ళారు.

మేరీ ఎప్పటిలాగే వాగుతున్నది.

తను మాత్రం దేనికీ జవాబు చెప్పలేదు.

'జయపూర్ రాజా బంగళా చూశావటోయ్'

ఏమీచూడక్కరలేదు. తన కేమీ చూడాలని లేదు. ఈఊరు తన కేమీ నచ్చలేదు.

'ఏమోయ్, ఈతపళ్ళు కొనుక్కుందాం?'

ఛీ ఈ ఊరేమీ బాగాలేదు.

మర్నాడంతాఅమ్మ ఏమీజరగనట్లే నటించింది. తనను చూసినప్పుడల్లా కళ్ళు తుడిచేసుకునేది. తనూ ఏమీ తెలియనట్లే నటించింది. మధ్యాహ్నం మామూలుగా గేటుదగ్గరకు పోకుండా, తోటలో ఓమూలకు పోయి ముంత మామిడిచెట్టు క్రింద కూర్చుంది. ప్రొద్దుకూకేవరకు అల్లాగే కూర్చుంది, చెట్లనీడలు చూస్తూ. ఇంటికి పోవాలనే అనిపించలేదు. ఎక్కరూ తనకోసం రాలేదు. అడవిలో రాజకుమార్తెలా ఒక్కర్తె కూర్చుంది,అమ్మమ్మను తలచుకుంటూ. తోటంతా అలసి నిద్రపోతున్నట్లుంది. ఎక్కడా చప్పుడు లేదు.

ప్రొద్దుకూకి తను ఇంటికి రాబోతూవుంటె, ఓ అమ్మి వచ్చింది. తోటమాలి పెళ్లాం కాబోలు. దాన్ని తనెప్పుడూ చూడలేదు. 'ఎవరమ్మోయి! జీడికాయలు కోయకూడదు' అన్నది.

'ఎవరూ కోయలేదు.' తను రోషపడింది. సమయానికి తోటమాలీ వచ్చాడు.

* * *

'ఓహో చిన్న దొరసాని' నవ్వుతో భార్యతో అన్నాడు.

'పెద్ద బంగళాలో జమీందారుగారు లేరూ! వారమ్మాయి.' ఆ అమ్మి కంగారుపడింది.

'ఇంటిదగ్గర దిగబెట్టనా అండి, చీకట్లో తోవ తెలీదు'

ఇద్దరూ నడిచి వెళ్ళారు.

ఇంటిదాకా వచ్చి ఆ అమ్మి అంది, ఆత్రుతతో.

'దొరసానిగారిని చూపిస్తారండీ?'

తను అమ్మకేసి చూపించింది. లోపల అమ్మ కూరలు తరుగుతోంది. ఆ అమ్మి ఉత్సాహమంతా పోయింది.

'ఆవిడా పని చేసుకుంటున్నారే' అనుకుంటూ వెళ్ళి పోయింది. తను తెల్లపోయింది. అమ్మదగ్గర కెళ్ళింది.

'అమ్మా, నువ్వుదొరసానివిట. ఆఅమ్మి నువ్వు పనిచేసు కుంటున్నావేమని అడుగుతోంది!' అన్నది. అమ్మ నవ్వింది.

'పనిచేసుకోకూడదా? కుర్చీవేసుకు కూర్చోనా?'

మళ్లీ అమ్మమ్మ జ్ఞాపకంవచ్చింది తనకు.

అమ్మమ్మ ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూనే వుండేది. ఒక్క నిమిషమైనా ఊరుకునేదికాదు. దిగులుగా అమ్మకేసి చూసింది. అమ్మ ముఖమూ వాడిపోయింది. తనను దగ్గరకు తీసుకుని కళ్ళనీళ్ళు పెట్టుకున్నది. తనకు చెప్పలేని బెంగ ముంచుకువచ్చింది. ఆవురుమని ఏడ్చింది. అమ్మ సముదాయించింది.

'ఊరుకో తల్లీ, ఈ ఊరు ఏమీ బాగాలేదు కాదూ? రేపు చక్కగా రైలెక్కి మన ఊరు వెళ్ళిపోదామమ్మా. ఇంక ఇక్కడ వుండవద్దు'. అన్నది.

తన తల్లో రైలు చక్రాలు గిరగిరా తిరిగినట్లయింది.

ఆ సెలవలు, ఆ తోట, సముద్రపు హోరు, మేరీపాట అన్నీ అమ్మమ్మ కథలలాగే దూరమై, ఇంకా దూరమై పోయినాయి.

# పునరాగమన

రాత్రి వాన కురవటం మూలాన ఆవేళ ఎంతో చల్లగా వున్నది. వర్షం తగ్గినా ఇంకా మబ్బులు పూర్తిగా విడిపోలేదు. చెదరిపోయిన మేఘాలు అటూ ఇటూ పరిగెడుతూ మధ్యమధ్య సూర్యుడిని కప్పేస్తున్నాయి. ఎన్నడూ ఇల్లుకదలనివాళ్ళకికూడా ఆవేళ బయటికి పోవాలని బుద్ధి పుడుతుంది. బజారుకో, సినిమాకో, స్నేహితుల ఇంటికో, ఎక్కడికో.

శకుంతల కిటికీ సగం తెరచిపెట్టుకొని తోటలోకి చూస్తూ కూర్చున్నది. వాళ్ల ఇల్లు వూరికి చివర. వకటి రెండు తప్ప అక్కడ ఎక్కువ ఇళ్ళు లేవు. ఆ వీధిలో సందడి చాలా తక్కువ. ఎప్పుడో వక బస్సు రంయ్‌మని పోతుంది. ఇద్దరాడవాళ్ళు గలగలా కబుర్లు చెప్పుకుంటూ పోతారు. ఏదో రిక్షా చడీ చప్పుడూ లేకుండా సాగిపోతుంది అంతే

ఆ తరవాత నిశ్శబ్దం.

అందరికిమల్లేనే శకుంతలకు కూడా మబ్బుగా ముసురుగావున్న రోజుల్లో బెంగ ఎక్కువగా వుంటుంది. సగం తెరుచుకున్న కిటికీలోనుంచి కొద్దిగా చల్లగాలి లోపలికి వస్తున్నది. శకుంతలకు తన పుట్టిల్లు, చిన్ననాటి అనుభవాలు జ్ఞప్తికివచ్చాయి. తలుచుకుంటె వింతగా వుంటుంది. తనకు చిన్నప్పటినుంచి వంటరిగా వుండటానికిఎంతభయం? అయినా చివరకు ఈ వంటరితనమే మిగిలింది.

ఏడెనిమిదేళ్లు వచ్చేదాకా తను తల్లిదగ్గరే పడుకునేది. ఒకరోజు రాత్రి తనకు జ్వరం వచ్చింది. అపరిమితమైన దాహంవేసింది. తన మంచందగ్గర గ్లాసులో నీళ్లన్నీ తాగే సింది. అయినా దాహం తగ్గలేదు. ఇష్టంలేకుండానే అమ్మను లేపింది. అమ్మ తనవంటిమీద చెయ్యివేసి చూచి 'ఎంత జ్వరమో!' అని ఆశ్చర్యపోయింది. ఆ తరువాత గ్లాసునిండా కాచిన నీళ్లు తెచ్చి ఇచ్చింది. ఆ దాహం, ఆ తృప్తి అల్లా మనస్సులో నిలిచిపోయినవి. అమ్మ ఎంత మంచిది! ఇంకో సారి—ఇంట్లో అంతా రథోత్సవం చూడటానికి వెళ్ళారు. ఏమి జనం! తనని ముందుకు వెనక్కి నెట్టేశారు. ఆ సం దట్లో అమ్మ చెయ్యి వదిలేసింది. తను ఆ తోపిడిలో తెప్ప రిల్లుకొని చుట్టూ చూస్తే అమ్మ లేదు. ఎవ్వరూ లేరు తన వాళ్ళు. అబ్బా! ఎంత భయంవేసింది.

గట్టిగా ఏడవాలనిపించింది. కాని ఏడుపు రాలేదు. ఎప్పటికైనా అమ్మ తనను వెతుక్కుంటూ వస్తుందని ఏదో ధైర్యం.

రథం కదలిపోయింది. జనం ముందుకు సాగారు. ఒక్కర్తె వంటరితనాన్ని అనుభవిస్తూ మొట్ట మొదటిసారి, బిక్కమొగంతో నిలుచున్నది. ఎక్కడనించో 'శకూ్క, శకూ్క' అంటూ అమ్మగొంతు వినిపించింది. ఒక్క గంతు వేసి ముందరికి పరుగెత్తింది. అమ్మను కలుసుకుంది.

ఆ రోజుల్లో వంటరితనమంటె ఏమిటో తెలియకుండా చేసేది అమ్మ. ఆమెకోసరమేనేమో, ఇప్పుడు ఈ బెంగ!

ఈ వూరు వచ్చి దాదాపు మూడు సంవత్సరా లవుతుంది. అప్పటినుంచి పుట్టింటికి పోనేలేదు. అన్నయ్య తనను తీసుకుపోవాలని ఎన్నిసార్లో వచ్చి వెళ్ళాడు. ఎప్పుడు తను ప్రయాణమైనా అతను నేనూ వస్తాననడం, చివరకు సెలవు దొరక్క ఇద్దరి ప్రయాణం ఆగిపోవటం.

అసలు తను పుట్టింటికి వెళ్లడం అతనికి ఇష్టంలేదేమో! లేకపోతే ఎందుకు ప్రతిసారి ఏదో అడ్డు చెపుతాడు?

అయినా, పాపం అతనికి మాత్రం వంటరిగా వుండడం కష్టం కాదూ? కొత్త ఊరు కొత్త భాష. మూడు సంవత్సరాలున్నా ఒక్క అరవంముక్క రాలేదు. ఒక్కరితో పరిచయంకాలేదు. ఆఖరికి పక్కఇంటివాళ్ళను కూడా పలకరించిన పాపానపోలేదు....

కాని ఇన్నాళ్ళయినా, అతన్నైనా పూర్తిగా అర్థం చేసుకోలేకపోతున్నది. అతను ఇంట్లో వున్న కాస్సేపు తనకు వంటఇంట్లో సరిపోతుంది. ఇంక మధ్యాహ్నమంతా ఒక్కతే కూర్చుని గడచిన సంగతులన్నీ జ్ఞాపకంచేసుకుంటుంది.

అప్పుడప్పుడూ అతను ఆతృతతో ఏదో వెతుకుతున్నట్లు తన కళ్ళల్లోకి చూస్తాడు. ఆ చూపులు తను అర్థం చేసుకోటానికి ప్రయత్నించలేదు. తను అలవాటుపడిన జీవితానికి అతను అంతరాయం కలిగించాడు. ఆ భావం అవ్యక్తంగా ఆమె మనస్సులో నిల్చిపోయింది.

చిన్ననాటి స్నేహితులు లక్ష్మి, సరస్వతి జ్ఞాపకం వచ్చారు. పాపం లక్ష్మి భర్త పోయాడని అమ్మ రాసింది. ఎల్లా వుందో పాపం. ఎప్పుడూ నవ్వుతూ ఉండేది. నవ్వినప్పు

డల్లా బుగ్గలు సొట్టపడేవి... సరస్వతి కప్పుడే ఇద్దరు కొడుకులు కాబోలు! బాల నిప్పు డెవరెత్తుకుంటున్నారో? ఇప్పుడు బాగా నడుస్తుంది కాబోలు! మాటలు వచ్చాయేమో! నాగమణికి కథ లెవరు చెబుతారు? వదిన చెబుతుందా?

బయట మళ్లీ వర్షం కురుస్తోంది. జల్లుకొడుతుంటే శకుంతల లేచి కిటికీ మూసేసింది. ఆమెకు పుట్టింటికి వెళ్లాలన్న బెంగ ఎక్కువైంది.

అతను ఇంటికి రాగానే వక్కసారి వూరికి వెళ్ళివస్తేనే గాని తనకు మనసు బాగుండదని, ఏదో బెంగగా వున్నదని చెప్పింది. అతను ఒక్కసారి ఆమె కళ్ళల్లోకి చూశాడు. కాని, ఏమీ అనలేదు. మర్నాడే రైలెక్కించాడు.

పుట్టింటికి వెళ్లాలని ఎంత వుత్సాహపడిందో పాపం! శకుంతలకు అక్కడకు చేరగానే అంత నిరుత్సాహం కలిగింది. వాళ్ళ వూరు చాలా మారిపోయింది. ఇదివరకు పల్లెటూరు లాగా వుండేది. ఇప్పుడు చిన్న బస్తీ అయింది. ఎక్కడ చూసినా కొత్త ఇళ్లే, కొత్త ముఖాలే. వాళ్ళ ఇల్లుకూడా ఎంతో మారిపోయింది. ఇదేనా నేను పుట్టిన వూరు, ఇదేనా నేను పెరిగిన ఇల్లు అనిపించింది.

బాల ఇల్లంతా గంతులువేస్తోంది. వసపోసినట్లు మాట్లాడుతోంది. కాని శకుంతకేసి ఎవరో కొత్తవాళ్లను చూసినట్లు చూసింది. దగ్గరకు పిలిస్తే రాలేదు. బలవంతంగా ఎత్తుకుంటే ఏడ్చింది. ఆశ్చర్యం. రాత్రి పగలు ఇదివరకు తనచంకలోనే వుండేది. ఇప్పుడు తను ఎవరైందీ కూడా దానికి గుర్తులేదు.

'వచ్చావా తల్లీ !' అన్నది అమ్మ. అంతే ! ఇంకేమీ మాట్లాడలేదు. ఇంకా రెండు పూటల వంట అమ్మే చేస్తున్నది. పెత్తనం అంతామాత్రం వదినది. పూజా పునస్కారాలలో మునిగి అమ్మ ఇంక దేంట్లోను జోక్యం కలిగించుకోటంలేదు.

వాళ్ళ ఇల్లు చాలా మార్చారు. పడమటివేపు వసారాలో అమ్మ తనూ పడుకునేవాళ్లు. ఇప్పుడు వసారా ధాన్యపు కొట్లుగా మారిపోయింది. మేడమీద దక్షిణపువేపు డాబాలో లక్ష్మి, సరస్వతి, తనూ రోజూ ఆడుకునేవాళ్ళు. అక్కడ గది కట్టించి అన్నయ్య కచ్చేరిసావడిగా వాడుకుంటున్నాడు. అక్కడ ఇదివరకు విరిగిపోయిన కొళాయి వకటి వుండేది. ఇప్పుడు దాని ఆనవాలుకూడా లేదు. స్నానాలగది, వంటఇల్లు ఇవేవి మునుపున్నచోట్లో లేవు. అన్నీ తను వదినను అడిగి తెలుసుకోవలసివచ్చింది.

వదిన తన్ను ఎంతో మర్యాదచేస్తుంది.

'స్నానానికి లేస్తారా.' 'భోజనానికి వస్తారా' అని మొదలుపెట్టింది. ఆ మర్యాద తన్ను మరీ పరాయిదాన్ని చేసింది.

ఇంటిముందర ఇదివరకు పెద్ద జామచెట్టు వుండేది. నిరుటి తుపానుకు పడిపోయిందట. వాకిట్లోకి వస్తే బావురుమంటోంది. అన్నయ్య తనూ జామకాయలకోసం ఎంత పోట్లాడుకునేవాళ్ళు!

అన్నయ్య ఇంక తనతో పోట్లాడడు కాబోలు! తనను చూసినప్పుడల్లా 'ఏంశకున్కా,ఏంచేస్తున్నా' వంటాడు.జవాబు

వినకుండానే వెళ్ళిపోతాడు. అన్నయ్యా ఇప్పుడు మంచి వ్యవహర్త. ఎప్పుడూ, వచ్చేవాళ్ళు, పోయేవాళ్ళు!

పుట్టింట్లో వున్నన్నాళ్ళు ఆఖరుకి నాగమణినైనా తనకు దగ్గరగా చేసుకోవాలని చూసింది. నాగమణి ఇప్పుడు బడికి వెళ్లుతున్నది. దానికి మునపటంత కథల పిచ్చి లేదు. ఇప్పుడు ఒక్క-రోజైనా నాగమణి శకుంతలదగ్గరకు వచ్చి చనువుగా కబుర్లు చెప్పలేదు. ఎవరో చుట్టం వచ్చింది, రెండు రోజులు వుండి వెళ్ళుతుంది అన్నట్టుగా ఎడఎడంగా వుండేది. వదినను మాత్రం చుట్టుకు చుట్టుకు తిరిగేది.

'వదినా, జడవేస్తావా?' 'వదినా, నా పెన్సిల్ చూశావా?' 'వదినా...' ఎప్పుడూ ఇదే ధోరణి.

వచ్చిన మూడో రోజున శకుంతల లక్ష్మిని చూడటానికి వెళ్లింది. లక్ష్మిమొఖం పాలిపోయి కళావిహీనంగా వున్నది. పట్టుకోకపోతే పడిపోతుందేమో నన్నంత బలహీనంగా వున్నది. శకుంతలను చూసి లక్ష్మి కూర్చోమని సంజ్ఞ చేసింది. శకుంతల చిన్ననాటి ముచ్చట్లని తనివితీరా చెప్పుకోవాలని ఎంతో వుత్సాహంతో వచ్చింది. కాని లక్ష్మి వక్క-మాట మాట్లాడలేదు. దిగులుచేత ఇల్లా వున్నదని శకుంతల వూహించుకొన్నది. ఈ మౌనంకంటె లక్ష్మి ఏడ్చినా బాగుండుననుకొన్నది. కాని లక్ష్మి ఏడవనూ లేదు, నవ్వనూ లేదు. ఈ ప్రపంచంతో సంబధంలేనట్లు శిలాప్రతిమలాగా కూర్చున్నది. శకుంతల ఎట్లాగైనా ఒక్క-సారి లక్ష్మిని నవ్వించాలని, లక్ష్మి తెల్లని బుగ్గలమీద మళ్లీ సొట్టలు పడితే చూడాలని ఎంతో ఉబలాటపడింది. కాని

సాహసించలేక పోయింది. ఈ లక్ష్మియేనా తనతో ఆడుకొన్నది! అంత అల్లరి చేసింది! ఎప్పుడూ నవ్వుతూ ఉండేది!

విచారంతో శకుంతల అక్కడినుంచి సరస్వతి ఇంటికి వెళ్ళింది. సరస్వతి ఊళ్లో లేదు. అత్తవారింట్లో వున్నది. సరస్వతి ఎప్పుడూ పుట్టింటికి రానేరాదని, దానికి వారి ధ్యాసే లేదని వాళ్ళమ్మ నిష్ఠూరంగా మాట్లాడింది.

సరస్వతి ఈవూరు రానేరాదట. తనెందుకు వచ్చింది? తను ఇక్కడ గడపిన రోజులన్నీ కలా? నిజమా? నిజమనుకోవడానికి ఏమిటి ఆధారం? ఆ రోజులు దూరమైపోయినాయి. మళ్లీ రావు. నిద్రలో నడుస్తున్నట్లు ఇల్లు చేరుకుంది.

శకుంతలకు ఎక్కువ రోజులు పుట్టింట్లో వుండాలనిపించలేదు. త్వరగానే తిరిగి వెళ్ళిపోయింది. మనస్సంతా అసంతృప్తితో నిండిపోయింది. అయినా ఇంటికి రాగానేమాత్రం కొంచెం బెంగతీరినట్లుంది. శకుంతల అనుకున్నది. గడచిన జీవితపు నీడలను వెతుక్కుంటూ జీవించాలనుకోవడం ఎంత వెఱ్ఱి. గడచిన జీవితమంతా కల. ఆ అనుభవాలు మళ్ళీ రావు. కొత్త అనుభవాలముందు ప్రాతవి మరిచిపోవడం నేర్చుకోవాలి.

శకుంతల ఇల్లంతా కొత్త మోస్తరుగా సర్దింది. కిటికీ తెరచి ప్రక్క ఇంటావిడను పలకరించింది. దొడ్లో పువ్వులన్నీ కోసి మాలకడుతూ కూర్చుంది. ఆఫీసునుంచివచ్చాక ఆతను ఆ మెకళ్ళల్లో ఎన్నడూలేని వుత్సాహం చూసి ఎంతో మురిసిపోయాడు.

* * *

# దేవాలయంలో

ఆరేళ్ళయింది. ఆ వూరికి అయిదుమైళ్ల దూరంలో దేముడు వెలిసి – ఎందుకో ఎవరికీ చెప్పకుండా, అర్ధరాత్రి ప్పుడు, శివుడు అక్కడ వెలిసి వూరుకున్నాడు! ఆ తరువాత అక్కడ దేవాలయం కట్టించారు. ఏటా శివరాత్రికి, అక్కడ గొప్ప వుత్సవం జరుగుతుంది. ఎక్కడెక్కడనుంచో జనం మూగుతారు. ఆ ఒక్కరోజు ఇసకవేస్తే రాలదు—అంత తీర్థ ప్రజ!

ఈ ఏడు శ్రీదేవికి ఎట్లాగైనా ఉత్సవానికి వెళ్లాలని బుద్ధిపుట్టింది. ఆరేళ్ళయింది. ఇంత దగ్గరగా వున్నా ఒక్క సారి ఉత్సవానికి వెళ్ళలేదు. ఏమిటో, దగ్గరైనకొద్దీ అశ్రద్ధ ఎక్కువవుతుంది. మళ్లీ కాశీ, రామేశ్వరం అన్నీ తిరి గొచ్చింది!

అయినా, ఈమాటు తప్పదు. సాధారణంగా, శ్రీదేవికి ఏవిధమైన ఆలోచన్లు రానేరావు. ఖర్మంచాలక ఎప్పుడైనా ఒక ఆలోచన వచ్చిందీ అంటే, ఇహ అది ఆచరణలో పెట్టేదాకా ఆమెకు నిద్రపట్టదు. పనికట్టుకొని ఇంట్లో అంద రినీ ప్రయాణానికి పురికొల్పింది: 'ఏముందీ; పొద్దున్నే బండి కట్టుకొని వెళ్లితే, ఆ మధ్యాహ్నం అక్కడ సత్రంలో దిగి స్వామిదర్శనంచేసుకొని, సాయంకాలానికి ఇంటికి రావచ్చు' ఈ పద్ధతి అందరికి నచ్చింది.

ఈమాట విని పక్కయింటి గవరమ్మగారు కూడా 'నేనూ వస్తాను, పిన్నిగారూ!' అన్నది.

ఆవిడ వస్తే, ఆవిడ కూర్చున్న బండిలో మరొకరికి చోటువుండదు కనుక, ఆవిడకు ప్రత్యేకం వకబండి మాట్లాడాలి. ఇంకా నలుగురు మనుష్యులకు సరిపోయే సామాగ్రి ఎక్కువ మూటకట్టాలి, అంతే:— అయినా తప్పేదేముంది!

శ్రీదేవి కుటుంబానికిచెందినవ్యక్తుల్లో, శర్వాణి, రమణి ప్రయాణానికి ఉత్సాహపడ్డారు.

ఒక్క కౌసల్యకు మాత్రం ఈ ప్రయాణం నచ్చలేదు 'ఇప్పు డెందుకు వెళ్ళాలి? అక్కడ గుంపులో చూసేదేమిటి?. ఇక్కడ లేడూ భగవంతుడు? '

సమాధాన మపేక్షించకుండా ఈ ప్రశ్నలు ఒక్కొక్కరినీ వేసింది.

కౌసల్యకు తను ఈమధ్య చదివిన కథ వకటి జ్ఞాపకంవచ్చింది.

ఆ కథలో ఆవిడకు నేలమీద మోకరిల్లి ప్రార్థన చేయడం ఇష్టంవుండదు. కటికనేలమీద కాళ్లు నొప్పులెత్తవూ! శరీరం బాధపడుతూవుంటే మనస్సు భగవంతుని మీద ఎట్లా లగ్నమవుతుందీ? —అందుకని, ఆవిడ మెత్తని పట్టు పరుపుమీద నడుంవాల్చి, చలివెయ్యకుండా కాశ్మీర శాలువా కప్పుకొని, అప్పుడు భగవంతుని స్మరించేది. కాని, పాపం! స్మరణ పూర్తికాకుండానే నిద్రపట్టేది!

కౌసల్యకు ఈ కథ తల్చుకున్నప్పుడల్లా నవ్వువస్తుంది. అయినా, కొంచెం యించుమించుగా కౌసల్యదికూడా ఇదే తత్వం. ఎక్కడికో ఎందుకు వెళ్లాలి! మనకు తలుచుకునే ఓపికవుంటే మన హృదయంలోనే లేడూ భగవంతుడు?

ఆవేళ, అంతా బయలుదేరాలనుకున్నారు. కాని ఏం లాభం? తీరా బళ్ళువచ్చాక, గవరమ్మగారు తను మహా ఎక్కడ పడితే అక్కడ సర్దుకోగల మనిషల్లే 'మీరంతా కూర్చోండి, నేను తరువాత ఎక్కడో ఒకచోటయిరుకుతాను' అని కూచుంది. ఇహ ఆవిడ ముందర సర్దుకుంటేనేగాని తక్కినవాళ్ళు ఎక్కడ సర్దుకోడానికి వీలులేక కొంత ఆలస్య మయింది... గుడిదగ్గరికి చేరేటప్పటికి జనం నేల ఈనినట్లు న్నారు. తీర్థయాత్రచెయ్యాలన్న సరదాతప్ప, వుపవాసానికి తట్టుకోగలవాళ్లెవరూ లేరు. అంచేత, ముందుగా సత్రానికి వెళ్లి, వంటప్రయత్నం చేసుకున్నతర్వాతనే గుడికివెళ్ళారు.

గుడిదగ్గర రకరకాల షాపులు వెలిశాయి. ఆ వక్క రోజు అక్కడ దొరకని వస్తువులేదు. అందరి చేతుల్లోనూ ఏదో వక కొత్తవస్తువు వుండనేవున్నది. శర్వాణికి, రమణికి ముందర గాజులషాపులు చూడాలనిపించింది. శ్రీదేవి కోప్ప డింది. తర్వాత చూడవచ్చంది. కౌసల్య, విధీ విసుగూ లేకుండా, వచ్చినవాళ్ళనందరినీ పరిశీలిస్తోంది.; ముఖ్యంగా స్త్రీలనే. ఎక్కడికి వెళ్లినా కౌసల్యకు అందమైన ఆడవాళ్ళను వెతుక్కోవటంతోనే సరిపోతుంది. చీరల అందం, నగల అందం, చూసి చూసి నెమరువేసుకుంటుంది. ఇంకా అపరి చితవ్యక్తుల హావభావాలనుబట్టి వాళ్ళస్వభావాలువూహించు కోవటంలో తనివితీరని సరదా.

మండపందగ్గర ఎవరో ఒకావిడ త్రోవతప్పినట్లు నిల్చున్నది. పెద్ద హాండ్ బాగ్, రిస్ట్‌వాచ్. ఈవిడ ఎందుకు వచ్చిందీ ఇక్కడికి? మాటిమాటికి హాండ్ బాగ్ పూపుతుంది.

సరిగపమిట సర్దుకుంటుంది. గుంపులోనుంచి ఇద్దరు వైశ్య బాలికలు తోసుకువచ్చారు. ఈవిడనుచూస్తూ అల్లాగే నిలబడిపోయారు. ఇంగ్లీషుకు ఇంకా విలువ పోలేదన్నమాట!

ఎవరో ఎరుగున్నావిడ శ్రీదేవిని నిలవేసింది: 'ఏమమ్మా మీ ఆయనకు ప్రమోషనయిందట!'

'అట్లాగా! శుభవార్త!! నా కింకా తెలియదులెండి!

రమణి, కౌసల్య నవ్వుకున్నారు.

అందరూ గుళ్లోకి వెళ్ళారు. లోపల అడుగుపెట్టడానికి వీల్లేకుండా వున్నారు జనం. వాకిలిదగ్గరే నిలబడిపొయ్యారు. గవరమ్మగారు మాత్రం తోసుకు ముందుకు వెళ్లింది. ఆ వెనకాలే కొంతదూరం మాత్రం వెళ్ళగలిగింది శ్రీదేవి. రమణి, శర్వాణి ఇంకొకరి కాళ్ళమీద నిలుచుండి స్వామి దర్శనం చేసుకోవాలని చూస్తున్నారు. కౌసల్య మనస్సులో భగవంతుని ధ్యానించాలని చూసింది. కాని ఏమీ లాభం లేదు. ఎప్పుడో, ఎక్కడో, ఏ సముద్రతీరాన్నో ఏ చెట్టు నీడనో, అప్రయత్నంగా హృదయం భక్తితో నిండిపోతుంది. కాని ఇక్కడ,— ఇక్కడ వద్దనుకున్నా నవ్వువస్తుంది!

'కౌసల్యా! దేవుడు కనిపిస్తున్నాడా?' అన్నది శ్రీదేవి.

'ఆహా! ఇంకా రెండునిమిషాల్లో కనిపించేటట్టే వున్నాడు!' అనుకున్నది కౌసల్య—ముందుకీ వెనక్కీ—తోస్తున్న గుంపులో ఉక్కిరిబిక్కిరి అవుతూ.

'అబ్బా! ఊపిరాడడంలేదు. నాలికీడుస్తున్నది! కొంచం తీర్థంఅయినా ఇస్తే బాగుండును!' అన్నది రమణి.

విసుక్కుంటూ అందరూ బయటికివచ్చారు. ఆతర్వాత,

అమ్మవారి గుళ్ళోకి వెళ్ళారు. ఇక్కడ అంత జనం లేరు. సావకాశంగా పూజచేయించవచ్చనుకున్నారు. శ్రీదేవి అష్టోత్తరం చేయిస్తానంది. గవరమ్మ నేనూ చేయిస్తానన్నది. అర్చకుడు 'కుంకుమ తెచ్చారా' అన్నాడు. గవరమ్మ తేలేదు. శ్రీదేవి తన కుంకుమలో సగం ఇస్తుందేమో నను కున్నది. కాని శ్రీదేవి సగం కుంకుమతోపాటు సగం పుణ్యం కూడా పోతుందనుకున్నదేమో, ఏమీ మొగ్గలేదు. కుంకుమ లేదని గవరమ్మకు కళ్ళనీళ్ళపర్యంతం అయింది. కౌసల్యకు ఇద్దరి ప్రవర్తనా నచ్చలేదు.

ఎదురుగా, ఇద్దరు అందమైన అమ్మాయిలుంటే వాళ్ళను చూస్తూ కూర్చుంది. వాళ్ళూ తనని గురించే మాట్లాడుకుంటున్నట్లున్నారు 'ఆజూకాలెంత బాగున్నాయో!'

కౌసల్య తనజూకాలు తడివి చూసుకున్నది.

'ఆ చీర చాల బాగుంది కాదూ! మైసూరు సిల్కు!'

కౌసల్య గర్వంగా తన చీర చూసుకున్నది. అందరూ తనలాగే, చీరలు, నగలు, చూడటానికే వస్తారన్నమాట.

'ఆమెడమీదకాయ పుట్టుకతోనే, వచ్చిందంటావా?'

సంభాషణ మారిందని తెలియక, కౌసల్య అదరిపడింది. గాభ రాగా మెడతడివి చూసుకుంది. కాని ఎదురుగుండా పాపం ఆ లోపంతో ఎవరో బ్రాహ్మణుడు కన్పించాడు.

'అమ్మయ్య! అని గట్టిగా నిట్టూర్చింది.

గవరమ్మ గర్భగుడి వాకిలి కెదురుగా నిల్చున్నది. ఎవరో ముసలమ్మ ప్రాధేయపడుతూ అడిగింది:

'అమ్మా కాస్త పక్కకు తొలగరూ!'

'బాగుంది ! నేనుమాత్రం చూడవద్దూ !'

ముసలమ్మ గొణుక్కున్నది.

'కాదని ఎవరనగలరమ్మా! వాకిలికెదురుగా నిల్చుంటే నైవేద్యంపెట్టేటప్పుడుకూడా వేరే తెరకట్టక్కరలేదు. మా అదృష్టం.'

కౌసల్యకు విసుగొచ్చింది. అక్కడ ఇంక వుండటానికి బుద్ధిపుట్టలేదు. తల తిరుగుతున్నదనిబయటికివచ్చింది.సత్రానికి వెళదామని బయలుదేరింది. వాకిట్లో నరసయ్య కనపడ్డాడు.

'ఏమమ్మా ! ఒక్కరే వచ్చారా ?'

'అబ్బే ! అంతా వచ్చారు, లోపలవున్నారు !'

'దర్శనమైందా ?'

'ఆ ! వాళ్ళింకా పూజచేయిస్తున్నారు. నేను సత్రానికి వెళుతున్నాను.'

'అదేమిటి ? స్వామివారి వాహనాలూ, అమ్మవారి నగలూ అన్నీ చూశారా ?'

నరసయ్య వర్ణించడం మొదలుపెట్టాడు. స్వామికి పన్నెండురకాల వాహనాలున్నాయి. అన్నీ బంగారపువే. అమ్మవారికి ఏడువారాల సొమ్ములూ వున్నవి. ఒక్క రత్నాల హారమే చేస్తుంది లక్షాఏభై వేలు !—తోవపొడుగునా బిచ్చగాళ్ళు బారులుతీర్చి అరుస్తున్నారు.

'ఒక్క కానీ తల్లీ, ఒక్కదమ్మిడీ అమ్మా !'

వినిపించుకోకుండా చెవిటివాళ్ళకు మల్లే దాటివచ్చారు. నరసయ్య ఇంకా వాగుతూనే వున్నాడు.

'నగలుఅందరికీ చూపించరండీ. మీాకు స్పెషల్‌గా—'

'నాకు చూడాలని లేదండి. మా వాళ్ళకు చూపించండి. లోపల వున్నారు' నరసయ్య వెళ్ళిపోయాడు.

భగవంతుడి ఐశ్వర్యం, మానవుడి దారిద్ర్యం రెండూ ఎప్పుడూ ప్రక్క-ప్రక్క-నే వుంటాయి కాబోలు!

ఎదురుగుండా ఎవరో భిక్షుక దంపతులు వస్తున్నారు. అందరు దంపతుల్లాగే వాళ్లకూ ఏదో ప్రణయకలహమో వుత్త కలహమో వచ్చినట్లున్నది. ఆమె ఏడుస్తున్నది.

అతను బాధతో జాలిగా అంటున్నాడు:

'నే నేమన్నాను? ఎందు కేడుస్తావు?' పాపం!..

సందుమలుపు తిరుగుతూ వెనక్కు తిరిగి చూసింది. వాళ్లిద్దరూ చేతులు పట్టుకొని కలిసివస్తున్నారు. ఆమె ఇప్పుడు ఏడవటంలేదు. వాళ్లిద్దరూ ఒకరికొకరు ఆధారం.

ఒకరిని విడిచి ఇంకొకరు బ్రతుకలేరు.

ఆ స్నేహమే వాళ్లకు జీవితంలో ఆశగలిగిస్తుందేమో! వాళ్లకు ఏమైనా ఇవ్వగలిగితే తన బాధ్యత, బాధ కొంత తగ్గును. కాని చేతులు ఖాళీ.

కౌసల్య ఎంతో నొచ్చుకుంది. ఏదో కలచినట్లయింది. తిరిగి చూడకుండా, గబగబా, సత్రానికి చేరుకుంది. అందరూ గుళ్ళో వుండటంమూలాన సత్రంలో జనసమర్దంలేదు.

సత్రానికివెనుక వేపునచిన్నతోటవుంది. అక్కడికెళ్ళింది

తోటమధ్యలో చిన్న కొలను వుంది. ఆ కొలను ఒడ్డునే పొన్నచెట్టు నీళ్ళవైపుకు వంగివుంటుంది. రాలిన పొన్నపూవులన్నీ నీళ్ళలో వరసగా పేర్చినట్టుంటాయి.

అరటిచెట్లూ, కొబ్బరిచెట్లూ, మధ్య మధ్యన ఏవో పూల మొక్కలూ, అన్నీ గుబురుగుబురుగా వుంటాయి.

పచ్చని గడ్డిలో ఎఱ్ఱని తీగ విచ్చలవిడిగా ప్రాకివుంది.

అట్టే అంత శ్రద్ధతీసుకొని పెంచిన తోటకాదు. ఒక వేళ అందునించే అంత ఆకర్షనంతంగా వుంటుందేమో!

కొలను దక్షిణపువేపున చిన్న చలువరాతి మందిరం వున్నది. అందులో కృష్ణవిగ్రహం తీర్చి దిద్దినట్లుంటుంది. ఆ మందిరంలో నిత్యం పూజా పునస్కారాలు లేవు. చుట్టూ చెట్లన్నీ ఆ గుడిమీదికి సగం వాలి వుంటాయి. ఆ మందిరం అక్కడ కేవలమూ అందంకోసరమే కట్టబడినట్లుంటుంది.

కౌసల్య కొలను మెట్లమీద నీళ్ళల్లో కాళ్లు పెట్టుకు కూర్చుంది. ఎక్కడా, ఆకైనా కదలని నిశ్శబ్దం. ఆక్షణంలో ఆమెకు నిశ్శబ్దమే స్నేహితురాలైంది.

కాలితో నీరు కదిపింది. వళ్ళంతా నీళ్ళు చిందాయి.

అమ్మయ్య! ఇక్కడ ఎంత హాయిగా వున్నది!! అప్రయత్నంగా ఆమె కళ్ళు మూతలుపడ్డాయి. 'భగవాన్! భగవన్!'- అల్లా ఎంతసేపు వున్నదో ఆమెకే తెలియదు.

'ఇక్కడున్నావా తల్లీ! నీకోసం గుడిఅంతా వెదకలేక చచ్చాం!' అన్నది రమణి.

'త్వరగా లే! శ్రీదేవి ఇప్పుడే వెళ్ళిపోదామంటున్నది' అన్నది శర్వాణి.

# మనసులోని మమత

పొయిలో పుల్లలు ఎగసన్రదోసి, మోకాళ్ళమీద ఆనుకు కూర్చుంది లక్ష్మి. అన్నం అప్పుడే ఉడుకుపడు తోంది. తుకతుకమని సంగీతం వినిపిస్తోంది. చేతిలోని విసన కర్ర జారవిడచి, ఊహాలోకంలో మునిగిపోయింది లక్ష్మి.

ఎక్కడో అందమైన రావిచెట్టు. ఆ చెట్టునీడనే ముచ్చటైన ఉయ్యాల— కొమ్మల మధ్యనుంచి వ్రేళ్ళా డుతో; అందులో మహాలక్ష్మిలా ఊగుతూ తనూ, వంటి నిండా నగలతో, ఇంకా ఇంకా. మరి, దూరాన, చిన్న బాబు— చిరునవ్వుతో...

'లక్ష్మీ! లక్ష్మీ!' — ప్రక్కయింటి పూర్ణమ్మ కేక వేస్తోంది.

స్వప్నజగత్తునుండి ఉలిక్కిపడి, తెలివితెచ్చుకుంది లక్ష్మి. సమయానికి వార్చక అన్నం ముద్దయింది. రోజూ వున్న గోడవేకదా అని విసుక్కుంటూ నిర్లక్ష్యంగా గిన్నె దింపి క్రిందపడేసింది. మండుతున్న పొయ్యివదలి దొడ్లోకి పరుగెత్తింది. ఒక్క అంగలో, ఆత్రంగా గోడదరి జేరింది.

పెరటి గోడదగ్గర పూర్ణమ్మ కనిపెట్టుకు నించున్నది, ఉత్సాహంతో, ఊపిరిసలపకుండా ఎన్నోకబుర్లు చెప్పాలని. ఇది రోజూ, మామూలే! ఏ వంటవేళో, పనివేళో, పూర్ణ మ్మకి ఆపుకోలేనన్ని వింత కబుర్లేవో లక్ష్మికిచెప్పవలసిరావడం, పని అంతా మానుకుని లక్ష్మి గోడదగ్గరికి పరుగెత్తి కళ్ళు

తేలేసి, వింటూ నించోడం, చివరకి ఇద్దరూ చీవాట్లు తినడం.

'ఎందుకోయ్!' అని ఆదుర్దాగా అడిగింది లక్ష్మి.

'మంచి కబురు, ఏమిటో తెలుసా?' అన్నది పూర్ణమ్మ

'త్వరగా చెప్పవోయ్! పాయి మండుతోంది... పోవాలి!' అని పరాధీనంగా, బెంగగా అన్నది లక్ష్మి.

'మా బుల్లెమ్మ పెళ్ళి ... ఇంక పదిరోజులే!'

'ఎవరికీ ? వసంతకే !'—సంతోషంలో సర్వం మరచి పోయింది లక్ష్మి.

ఉత్సాహంతో వివరాలన్నీ చెప్పడం మొదలెట్టింది పూర్ణమ్మ.

'పెళ్ళికొడుకు ఇంజనీరు చదువుకున్నాడు. పదివేలు కట్నం. బ్యాండు మేళం, సాయంత్రం డాన్సు. చుట్టాలందరికి పట్టుచీరలు, ఇంకా ఇంకా...' ఏవేవో అంతులేకుండా చెప్పుకుపోతున్నది పూర్ణమ్మ.

విస్తుబోయి వింటోంది లక్ష్మి. మనస్సులోనే, మళ్ళా మళ్ళా మననంచేసుకోవడం మొదలెట్టింది: 'పదివేలు కట్నం, పట్టుచీరలు—అమ్మో !'

లక్ష్మి కొత్తగా పనికి వచ్చింది. పాపం పదహారేళ్ళు వచ్చేవరకూ కలో గంజో త్రాగి ప్రపంచాన్నెరక్కుండా తల్లిచాటున పెరిగింది. కరువు రోజుల్లో గతిలేక తల్లి పనికి పంపింది. క్రొత్త యింట్లో పని సరిగా చాతకాకపోయినా, తన మంచితనంవల్ల అందరికీ తల్లో నాలికలా వుండేది... సుబ్బమ్మగారు, యింటి యజమాని రమణయ్యగారు, కూతురు

సరళ, కోడలు ఊర్వశి, చిన్నబాబు, అందరూ, కొద్దో గొప్పో లక్ష్మిమీదే ఆధారపడి వుండేవాళ్ళు. ఐశ్వర్యం, ఆనందం యెరుగని లక్ష్మికి సుబ్బమ్మగారింట్లో అంతా వింతగా వుండేది. ఏదో స్వప్నలోకంలో వున్నట్లు అన్నీ ఆశ్చర్యంతో చూస్తూ, ఉత్సాహంగా తిరుగుతుండేది. అయినా ఆ యింట్లో లక్ష్మితో ఆప్యాయంగామాట్లాడేవాళుమాత్రం అరుదైనారు. అందునించే వూసుపోక తన గోడు చెప్పుకోవడానికి ప్రక్క-ఇంటివారి వంటావిడ పూర్ణమ్మ ఆధారమైంది. తన ఇంటివారి గొప్పలు చెప్పి వూరికే లక్ష్మిని వూరించడం పూర్ణమ్మకు సరదా. పూర్ణమ్మమాటలు వింటూ, కలలుకంటూ, లక్ష్మి రోజులు గడుపుతుంటుంది.

పెరటిగుమ్మంలోకి వచ్చి సుబ్బమ్మగారు కేకేసింది! 'లక్ష్మి! లక్ష్మి!!'

సంభాషణ పూర్తిచేయకుండానే పూర్ణమ్మ వెళ్ళిపోయింది. ఉత్సాహంతో లక్ష్మి సుబ్బమ్మగారిదగ్గరకి వచ్చింది.

'అమ్మా! మరేం... వాళ్ళ వసంతమ్మకు...' అంటోంది. సుబ్బమ్మగారు మాట వినిపించుకోలేదు.

'పొయ్యి మండిపోతుంటే, పెత్తనాలుచేస్తూ కూర్చున్నావా? ఆ కూరగిన్నెమీద మూత పెట్టలేదేం?' అని విసురుకుంటూ, లోపలికి వెళ్ళిపోయింది. వంటినిండా నగలు పెట్టుకొని అందెలు, గాజులు గలగలలాడిస్తూ తిరగటం ఆమెకు చాలా సరదా.

పులుసుగిన్నె పొయ్యిమీద పెట్టి, లక్ష్మి మళ్ళీ ఆలోచిస్తూ కూర్చున్నది! వసంతకి పెళ్ళి... పదివేలు కట్నం..

బ్యాండుమేళం ... యెంత బాగుందో ! యెప్పుడో తనకీ పెళ్ళవుతుందేమో ! ... చిన్నబాబు తనని చేసుకోకూడదూ ? ఏమో ! అప్పుడదేదో సినిమాలో, ఆ నాయకుడు ఇంట్లో పని చేస్తూన్న అమ్మాయినేగా ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు... అట్లాగే, ఏమో !

మేడమీదనుంచి ఊర్వశి కేకవేసింది ! 'నీ వంటపని కాగానే, ఒక్కసారి పైకి రా...పట్టుచీరలు యెండలో వేయాలి! ...'

త్వరగా పని ముగించుకొని పైకి వెళ్ళింది. తెరచివున్న బీరువాముందు చీరలు కుప్పలుకుప్పలుగా పడివున్నాయి. ఊర్వశి గాజులు సర్దుకుంటోంది. లక్ష్మి చీరల్ని ఒక్కొక్కటి తీసుకువెళ్ళి గాలికి ఆరవేసింది. గుప్పుమంటూ నాఫ్తలీన్ వుండల వాసన మేడంతా వ్యాపించింది.

చీరలు ఆరవేస్తున్నంతసేపూ లక్ష్మి యెంతో తపించింది, వసంతమ్మ పెళ్ళిముచ్చట్లు వూర్వశికి వినిపించాలని. కాని, వూర్వశి వుద్యోగస్థుల పిల్ల. చిన్నప్పటినుంచి అతి నాజూకుగా పెరిగింది. అప్పుడే కలకత్తానుంచి కొత్తగా కాపరానికి వచ్చింది. పని చెప్పటానికి తప్ప, యింక నౌకర్లతో మాట్లాడడం ఆఅమ్మ కెప్పుడూ అలవాటులేదు. లక్ష్మిని నోరు విప్పనీయలేదు.

'చూడు, చీరలన్నీ మడతలు విప్పవద్దు. అలాగే ఆర వేయి. వెళ్ళేటప్పుడు ఈ మాసినగుడ్డల్ని క్రిందకు పట్టుకుపో' అంది. ఆ తరువాత ఆ గదిలో లక్ష్మి వున్నదన్నమాటే మరచిపోయింది.

పన్నెండు గంటలకి అందరూ భోజనానికి కూర్చు న్నారు. లక్ష్మి వడ్డిస్తోంది—తల్లీ, తండ్రీ, కూతురూ, కొడుకూ అందరూ ఒకేసారి మాట్లాడుతున్నారు. ఒక్కటే రణగొణ ధ్వని. రమణయ్యగారు అన్నం కేసి విస్తరి కేసి చూడ కుండా పెద్ద గొంతుకతో అంటున్నాడు.

'వెధవది, అవతలి పార్టీవాళ్ళు వృత్తినే హడలిపోయి కేసు విత్‌డ్రా చేసుకున్నారు. కాని, లేకపోతే రేపు కోర్టులో నా తడాఖా చూపిద్దును. జడ్జీలంతా దద్దరిల్లిపోవాలిసింది. ఓహ్! ఎన్ని పాయింట్సు... ఎంత బాగా ప్రిపేరు చేశాను!'

చిన్నబాబు సంతోషంతో వుప్పొంగిపోతూ చెప్పాడు:

'ఇవ్వాళ మాచ్‌లో గెలిచానా, సెమి ఫైనల్స్‌కు వస్తాను. సాయంత్రం మూడింటికే మాచస్ మొదలు. నువ్వు వస్తావా సరళా, చూడ్డానికి?...'

సరళ ఈ మాటలు వినిపించుకోలేదు. తలకాయ వంచు కొని భయపడుతో వినపడీ వినపడకుండా గొణిగింది! 'రేపే మా కాలేజీవాళ్ళంతా పిక్నిక్‌కి వెళ్ళడం. కొంతమంది ఆడ పిల్లలుకూడా వెళ్ళుతున్నారు. నేనుమాత్రం ఎందుకు వెళ్ళ కూడదూ?'—ప్రశ్నార్థకంగా అందరిముఖాలూ చూచింది. కాని ఎవరూ సరళకేసి చూడలేదు.

సుబ్బమ్మగారు విస్తట్లో అన్నీ ఒక్కొక్కటే తడిమి తడిమీ చూసుకుంది. నిరాశతో సణుక్కుంది!

'అన్నం, మళ్ళా ముద్దే అయింది. ఈ కూరలో ఉప్పు చాలదు. ఎన్నిసార్లు చెప్పినా దీనికి-' నిస్పృహతో, చిరా కుతో లక్ష్మి కేసి ఉరిమిచూసింది.

లక్ష్మికి ఎవరిమాటలూ వినపడలేదు. ఏదో చెప్పలేని ఆవేగంతో హృదయం దడదడ కొట్టుకుంటోంది. వసంతమ్మ పెళ్ళిసంగతి మెదడులో రొదచేస్తూనే ఉంది. ఒక్క-క్షణం సందడి తగ్గితే ఆ శుభవార్త నలుగురికీ చెప్పాలని ఆత్రుత. 'పదివేలు కట్నం!—పాటకచ్చేరీ! పట్టుచీరలు!' ఈ మాటలు వింటే అందరూ ఎంత ఆశ్చర్యపోతారు! ఒక్క-క్షణం నిశ్శబ్దంగా వుంటే—మనస్సు తహ తహ లాడింది. కాని, ఒక్క-క్షణమల్లా మాట్లాడకుండా వా రుండగలరా!

సుబ్బమ్మగారు చీదరించుకుంటూ అరిచింది.

'అదేమిటి మొద్దులా నించుంటావ్! అయ్యగారి విస్తట్లో అన్నం అయిపోతే కనపడ్డంలా? ఏంకావాలో చూసి వడ్డించు!'

అయ్యగారికి అన్నంవడ్డిస్తూ, నిరుత్సాహంతో, పెళ్ళి కబుర్లు చెప్పే ఆశ వదులుకొంది లక్ష్మి

* * *

పనిఅంతా ముగించుకొని మండువాలో కొంగు పరుచుకు పడుకుంది. మాగన్నుగా నిద్రపట్టింది, ఏవేవో కలలు—రకరకాల రంగుకాగితాలతో అలంకరించివుంది పెళ్ళి పందిరి! ఎంతమందో, పట్టుచీరలతో, జరీకండువాలతో హడావిడిగా తిరుగుతున్నారు. అనుకోకుండా, మధ్య మంటపంలో తను కూర్చునివుంది. ఎక్క-డినుంచో మెల్లిగా మంత్రాలు వినపడుతున్నాయ్. తన తలనిండా పసుపూ అక్షతలు ఒత్తుగా పడివున్నాయి. తన చేతిలో ఎక్క-డిదో గులాబీదండ వున్నది. విస్తుపోయి చూస్తున్న తనకి ఎదురుగా చిన్న

బాబు కనిపించాడు చిరునవ్వుతో. సిగ్గుతో భయంతో కం గారుగా దండఎత్తి అతనిమెడలో వేయబోయింది. మళ్ళీ చప్పున ఆగిపోయింది. నిద్రలోనే వెనుకనుంచి ఎవరో కేక వేస్తున్నట్లయింది. 'లక్ష్మీ !'

నిద్రకళ్ళతో ప్రక్కకు వత్తిగిల్లింది. కల సడలిపోయింది.

'ఏయ్! లక్ష్మీ !'...మళ్ళీ పిలుపు. చిన్నబాబుగొంతు... కళ్లు నలుపుకుంటూ లేచి నిలుచుంది. ఎదురుగుండా చిన్న బాబు నిల్చుని వున్నాడు....మందహాసంతో. కలలో తనని ఆవరించిన సిగ్గూ, భయమూ కంపమూ ఇంకా వదలలేదు. అతనికేసి ఆదుర్దాగా చూసింది. అతను అన్నాడు: 'చూడు, నేను రెండుగంటలకే బయటకి పోవాలి. నా తెల్లబూట్లు కొం చెం పాలిష్ చేసిపెట్టవ్ !'

లక్ష్మి దీనంగా అతని కళ్ళల్లోకి చూస్తూ అణుమాత్రం ఆప్యాయతకోసం వెదుక్కుంది. అతనికి ఆ ధ్యాసే లేదు.

'చూడు, పాలిష్...హాల్లో అలమారలో వున్నది. త్వరగా కానియ్' అంటూ, తిరిగిచూడకుండా వెళ్ళిపోయాడు.

హృదయంలో కలిగిన వెలితిఏమిటో, ఎందుకో ఆలో చించుకోకుండా, హాల్లో అలమారవైపు నడిచింది లక్ష్మి.

సాయంత్రం దొడ్లో మల్లెపూలన్నీకోసి దండలు కడు తూవుంటే సరళ వచ్చి కూర్చుంది. 'పూలన్నీ చాలా వున్నట్లు న్నాయి ! నేనుకూడా కట్టనా ?' అన్నది. సరదాకి నాలుగు పూలు తీసుకుని వేరేదారానికి కట్టింది.

లక్ష్మి అన్నది: 'ఎందుకమ్మా ! ఇంకా వంటవేళ కాలేదుగా ! ఈ కాసిసిపూలు నేనే కట్టేస్తాలే !'

సరళ మాట్లాడలేదు. ఏదో చెప్పాలని ఉబలాటపడుతూ, మళ్ళీ సందేహపడుతూ ఊరుకున్నది. లక్ష్మికూడా ఏదో చెప్పాలని సరదాపడుతూ, మళ్ళీ జంకుతూ మౌనంగా వుండిపోయింది.

చివరకి లక్ష్మి అన్నది: 'మన ప్రక్కింటివాళ్ళ మ్మాయి, వసంతమ్మకు పెళ్ళిట. ఇంకా పదిరోజులుందిట...'

'ఎవరికీ? ఆ పొట్టిగా, నల్లగా, గుండులా వుంటుంది. దానికా?' అన్నది సరళ.

'వాళ్ళ చిన్నమ్మాయికండీ! పదివేలు కట్నమట' అన్నది లక్ష్మి యేదో గొప్ప విషయంలా...

'అవును! పదివేలయినా ఇవ్వంది దా న్నెవడు చేసుకుంటాడూ!' విసుగుతో నీరసంగా అన్నది సరళ. లక్ష్మి మాట్లాడలేదు. నిరుత్సాహంతో వూరుకుంది.

సరళ మళ్ళీ అన్నది: 'చూడు! లక్ష్మి! నాకోసం ఓ అబ్బాయి యేవో పుస్తకాలు పట్టుకువస్తాడు. కాస్త కని పెట్టి వుండి, రాగానే నాకు చెప్పు'

'అట్లాగే!' అని మూలకడుతూ తల యెత్తకుండా అన్నది, లక్ష్మి.

'అదికాదు, ఆ అబ్బాయి కసలే సిగ్గు. నేను కనబడక పోతే వెళ్ళిపోతాడేమో, పోనీయమాకు. రాగానే నన్ను పిలు' అంటూ, కొంచం ధైర్యం తెచ్చుకుని మళ్ళీ చెప్పింది సరళ.

మేడమీదనుంచి సుబ్బమ్మగారు వచ్చారు. వస్తూనే లక్ష్మిని చూసి అన్నది. 'ఏమే, ఇంకా వంట మొదలుపెట్ట లేదూ! రాత్రికి కూర యేమైనా వున్నదా ?'

'ఇదుగో వెళ్తున్నాను. చూస్తా' నంటూ కట్టిన మల్లె పూలు పళ్ళెంలో పెట్టి లేచింది లక్ష్మి.

రాత్రి యెనిమిదింటికి వంటింట్లో పని ముగించుకొని పెరట్లో మల్లెపందిరిదగ్గర కూర్చున్నది లక్ష్మి. యేమీ తోచ లేదు. ఇంకా యెవరూ భోజనానికి రాలేదు. ఆలోచిస్తో, ఆకాశంకేసి చూస్తో కూర్చున్నది.

వారాలబ్బాయి శంకరం వచ్చాడు. 'అయ్యగారు పం చాంగం తెచ్చిపెట్టమన్నారు. ఇదుగో!' అంటూ చేతికిస్తూ ఆమెచెయ్యి తాకాడు. లక్ష్మి అసహ్యించుకుంది.

'సరే...ఇస్తాలే ...వెళ్ళు!'అని పంపివేసింది.

ఏమీతోచక యేదో దిగులుతో మల్లెపందిరిచుట్టూ తారట్లాడింది. ఇల్లు, అమ్మ జ్ఞాపకంవచ్చారు. మళ్ళీ ప్రక్క యింటివారమ్మాయి పెళ్ళిసంగతి గుర్తుకువచ్చింది. మళ్ళీ మనసులో యేదో ఉత్సాహం రేకెత్తింది.

గబగబా పెరటిగోడదగ్గరకు వెళ్ళి కేకపెట్టింది. ''పూర్ణమ్మా ! పూర్ణమ్మా !''

లోపల్నుంచి రొజుకుంటూ వచ్చింది పూర్ణమ్మ.

''ఎందుకూ?'' అన్నది.

'మీ వసంతమ్మ పెళ్ళీటగా?' అన్నది అమాయకంగా లక్ష్మి.

'అవును. ప్రొద్దున నేనేగా చెప్పానూ?' అన్నది ఉత్సాహంతో, పూర్ణమ్మ.

'నువ్వేనా! మరచిపోయాను. పదివేలుటగదా కట్నం!' సిగ్గుతో అన్నది లక్ష్మి.

"ఆఁ! పదివేలు కట్నం, పెళ్ళివారందరికీ పట్టుచీరలు" అని, వరసగా ఆనందంతో జాబితా యేకరువు పెట్టింది పూర్ణమ్మ.

ఆతృతతో, ఉత్సాహంతో విస్తుపోయివింటూ నిలుచున్నది లక్ష్మి.

# అపశ్రుతి

గంగానది కలకలస్వనాలతో గానంచేస్తూ చల్లగా సాగిపోతున్నది. మలయపవనుని బిగికౌగిటిలో కదలిపోతూ తరులతలు గలగల పాడుతున్నవి. ఆనందాన్ని అందిపుచ్చుకొంటూ పక్షులన్నీ పరవశంతో ఆలాపిస్తున్నవి. దిశదిశల నుండివచ్చి యీ మధురగానం నా హృదయాన్ని నింపివేస్తున్నది. కాని, నాహృదయంలో మాత్రం యేమూలో యేదో అపశ్రుతి. ఎంత మనోజ్ఞమైన రాగమైనా నాకు అపస్వరాలతో మిళితమౌతున్నది. తీయని పాట, తియ్యని మధువు నా కీజీవితంలో కరువైనవి. శూన్యాన్ని తిలకిస్తూ శూన్యానికై నిరీక్షిస్తూ యీ జీవితం యిట్లానే గడచిపోతుంది.

అమ్మ అంటుంది. 'చిరునవ్వులు వెదజల్లుతో అప్పుడే కన్ను తెరచిన పాపలాగ అప్పుడే విరిసిన పూవులాగ నిన్ను తిరిగి చూడగలనా యీ జన్మలో' అని. నేను తొలిసారి నవ్వినది—నాకు యింకా ప్రస్ఫుటంగా జ్ఞాపకమున్నది. అప్పుడే తొలిసారి నిద్రమేల్కొన్నాను. కండ్లయెదుట అతను—దూరాన్నుంచి నాకేసేచూస్తూ చిరునవ్వు నవ్వాడు. ఎంత ఆప్యాయంగా యెంత మనోహరంగా నవ్వుతాడు! కలత నిద్దురలో యిది కలా, నిజమా అనుకున్నాను. నాకు తెలియకుండానే నాపెదవులు నవ్వటానికి ప్రయత్నించినవి. అదే నేను మొదటిసారి నవ్వినది. ఆరోజు మొదలు మేము ప్రతిరోజూ చిరునవ్వులతోనే పలకరించుకుంటూవుండేవాళ్ళం.

ఒకరోజు ఒంటరిగా వుండగా అతను వచ్చాడు. అడగకుండానే 'నేను అంబర రాజకుమారుణ్ణి, నాపేరు చంద్రుడు' అన్నాడు. నేను బదులు పలుకలేదు. హృదయమంతా, శరీరమంతా ఆనందంతో నిండిపోయినప్పుడు మాటలెలా వస్తాయి? అతను దగ్గరగావచ్చి నా తల నిమిరాడు. వేరే యేమీ చేయలేనట్లు నా తల అతని గుండెల మీద వాల్చాను. అతని హృదయం నాకు ఆశ్రయమిచ్చినట్లు తోచినది. జీవితమంతా యిట్లాగే తలపెట్టుకొని నిద్రపోతాను ఇంకేమి కావాలనుకున్నాను. జీవితంలో వేరే కోరుకోదగిన దేమీ లేనట్లే తోచినది.

అతను ప్రతిదినమూ వచ్చేవాడు. ప్రతిరోజు నన్ను తనతో రమ్మనేవాడు. 'కలూ, నాతో రావూ, నీవులేని జీవితం యెడారిలాగావుంది. కలూ, నీవు నా రాణివి, నా మందిరంలోనే వుండటానికి అర్హురాలివి, నా యింటికి యెప్పుడు వస్తావు?' ఇదే ధోరణి. ఆకాశంలో స్వేచ్ఛగా విహరించే విహంగంలాగ దిక్కు-దిక్కూ- చూచుకుంటూ పోయే అతనికి నా బాధ, బంధన యెట్లా అర్థమౌతుంది! అమ్మ నన్ను కదలనిస్తుందా! మాలతీలత యేమంటుంది? మందారమాల నవ్వదూ! అందరూ కలువరాణి చంద్రునితో కలిసిపోయిందని అనుకోరూ! అప్పటికీ అమ్మతో అన్నాను. 'చంద్రుడు చాలా అందంగావుంటాడు కాదూ!' అని. 'అయ్యో! వెఱ్ఱితల్లీ! అంత పెద్దమచ్చ నీకు కనపడలేదుటే' అని నవ్వింది. మచ్చా! అవును, నిజమే, అతని నుదుటిమీద పెద్దమచ్చ. అయితే అది యిన్నాళ్లూ కనపడనేలేదే! మర్నాడు చంద్రుడు

వచ్చాడు. అతను వున్నంతసేపు ఆ మచ్చ జ్ఞప్తికిరానేలేదు. ఆశ్చర్యం! దూరంకాగానేమాత్రం ఆ మరక పెద్దదై భూమి అంతా ఆవరించుకొని నాఆశలన్నీ అణగద్రొక్కుతూ నన్ను దుఃఖంలో ముంచెత్తుతుంది. ఇది యెట్లా మరచిపోగలను. చివరకు అతనినే అడిగాను. 'ఎప్పుడూ నాతోటేవుంటే నీకు జ్ఞాపకం రానేరాదు రాణీ, నాతోరావూ' అన్నాడు. అదే నిజమనిపించింది. 'రోజూ నిద్రపోతూన్నా, మెలుకువతో వున్నా ప్రతినిమిషం నీతోటే వుండాలని వున్నది' అన్నాను. ఆరోజే అతనిదేశం వెళ్లిపోయినాము.

ఎంతో ప్రేమతో అతను తన యింటికి తీసుకువెళ్లాడు. త్రోవపొడుగున మేఘబాలలు మాకు స్వాగతం ఇచ్చాయి. అతనిలాగా అతని అద్దాలమేడ యెంత అందంగావున్నది! అతనిలాగే అతనిని ఆశ్రయించినవన్నీ సుకుమారంగానే వున్నవి. ఆనందంలో ప్రపంచంలో దుఃఖంవున్నదన్నమాటే మరచిపోయినాను. బాహ్యప్రపంచానికి దూరంగా అతని యింటిలో అతనిలో కలిసిపోయివున్నాను. ఆ ఆనందం మత్తు కలిగించింది. ఆ తన్మయత్వంలో ఆ విశాలావరణంలో నా స్థానమేదో కూడ విచారించుకోలేదు. ఆ యింటికి అతిథిగా వచ్చానా, గృహిణిగా వచ్చానా లేక చెలినై వచ్చానా యివి యేవీ మనసుకు తట్టలేదు. అతని హృదయానికి తల నాన్చి పరవశమైపోతున్నాను. అత నలాగే ఆనందంలోమునిగిపోయినాడు. ఇరువురమూ ప్రపంచాన్నే మరచిపోయినాము.

ఎవరో కిలకిలా నవ్వారు. అదరిపడి తలయెత్తి చూశాను. ఆ నీలిఅద్దాలమేడలో నీలాకాశంలోని నక్షత్రాలలాగా

తళతళా మెరిసిపోతున్నారు. అబ్బా, యెంతమందో! అందరూ నన్ను హేళనచేస్తూన్నట్లుంది. చంద్రుడు తెల్లపోయి దిగులుగా చూస్తున్నాడు.

'వాళ్ళందరూ యెవరు' మథనపడి మథనపడి చివరకు ధైర్యం తెచ్చుకొని అడిగాను. చంద్రుడు శాంతంగా జవాబు చెప్పాడు: 'అందరూ నా మిత్రులు, నా సహచరులు' ఆశ్చర్యంవేసింది. సహచరులా! ఇంతమందితో పరిచయం వున్నట్లు యెప్పుడూ చెప్పలేదే!

'అందరూ నీ దగ్గరే వుంటారా?' అనుమానిస్తూ అడిగాను.

'ఎప్పుడూ నాతోకూడానే వుంటారు. నన్ను విడిచిపెట్టి ఒక క్షణమైనా వుండలేరు.

నీలిఅద్దాలలోనిరంగు నా ముఖమంతా ఆవరించింది. ప్రపంచంలోవున్న దిగులంతా ఒక్కసారిగా నన్ను చుట్టుకొన్నది. ఇంతమందిమధ్య నే నెవర్ని, నా కేమిస్థానమున్న దిక్కడ--ఆఖరు ప్రయత్నంగా అడగలేక అడగలేక అడిగాను.

'వాళ్ళందరూ అంటే నీకు చాలా యిష్టమా?'

'ఆ! చాలా యిష్టం.'

నా క్రింద భూమిపగిలి నేను పాతాళానికి క్రుంగిపోతున్నట్టనిపించిది.

హృదయం వేసవియెండవలె కనలిపోతున్నది. ఇంతమంది యిష్టమైనవాళ్ళుండగా నేనెందుకు కావలసివచ్చాను? దీనికి జవాబులేదు. ఇది నా కప్పుడు అర్థంకాలేదు. ఎప్పుడూ

అర్థంకాదేమో! ఎక్కడో విదేశాలలో ఆప్తులందరికీ దూరమై విపరీతాసభవాలమధ్య వున్నట్లనిపించింది. తీరనిబెంగ ఆవహించింది. అమ్మ నాకోసరం ఎంత బాధపడుతున్నదో! కొలనులో పూవులన్నీ నన్ను 'కలువరాణీ కలువరాణీ' అని యెంతగా ప్రేమిస్తాయి. అందరికీ దూరమైపోయినానుగదా అని దుఃఖం పొర్లుకొచ్చింది.

'చంద్రా నేను వెళ్ళిపోతున్నాను. ఇంతమందివుండగా నీకు నా అవసరం యేమున్నది. అమ్మకు నేను చాలా అవసరం.' 'వీరందరితో కలిసిమెలిసి వుండలేకపోతే వెళ్ళవచ్చును.' ఎక్కడా విచారపడుతున్నట్లుగాకూడా కనపడలేదు. ఇంతమందితో కలిసి యెట్లా వుండగలను? అందరూ ప్రతి నిమిషము నాయెదుట తిరుగుతూ నన్ను వెక్కిరిస్తూవుంటే అంతా యెట్లా మరచిపోగలను? చంద్రుడు, నేను తప్ప యింకెవరూ లేరని యెట్లా అనుకోగలను? 'నేను పోతున్నాను'

చంద్రుడు మాట్లాడలేదు.

వాడిన పూవువలె నేలకు రాలిపోయినాను.

నిద్రలేచేసరికి అమ్మవడిలో వున్నాను. అమ్మ తల నిమురుతూ వున్నది. ఆమెకళ్ళవెంట నీళ్ళు కారుతూవున్నవి. 'అంతా మరచిపో తల్లీ' అన్నది. అంతా మరచిపోవటం యీ జన్మలో సాధ్యంకాదు. చంద్రుడు ప్రతినిమిషం నా యెదుటనే వున్నాడు. సాయంత్రంవేళ పొదలమాటునవుండి దీనంగా చూస్తాడు. నడిరాత్రివేళ మబ్బులమధ్యనుండి ఆదుర్దాగా తొంగిచూస్తాడు. నేను యెక్కడికి వెళ్ళినా నాతో

కూడానే వుంటాడు. అమ్మతో సముద్రస్నానానికి వెళ్ళాను. కెరటాలమీద తేలిపోతూన్నాడు చంద్రుడు. అయితే అతనికీ నాకూ వేయిమైళ్ల దూరం. ఇంక యెప్పటికీ కలుసుకోలేనేమో! చంద్రునికి దూరమైపోయిననాటినుంచి నా హృదయంలో యేదో అపశ్రుతి కలిసిపోయినది. ఎంత తియ్యని సంగీతమైనా యేదో అపశ్రుతి. చల్లని గంగాజలంలోకూడా యేదో వేడిమి; మధువులోకూడా యేదో చిరుచేదు. ఈ జీవిత మింతేనేమో!

# రైల్లో

సాయంత్రం ఆరవుతుంది.

'ఇంకా అరగంటే టైమున్నది. వెంటనే బయలు దేరాలి' అన్నాడు అన్నయ్య.

ఇట్టివైనిమిషాలో కలకత్తామెయిల్ థర్డుక్లాస్‌లో అడుగుపెట్టాను.

పెట్టె నిండిపోయివున్నారు జనం. ఒకరినెత్తిన వకరు. ఎక్కడా సందు లేదు. వూపిరి ఆడటంలేదు. అప్పుడే ఓమూల సన్నగా యుద్ధం ఆరంభమైంది. ఇంక సామానుకు అంతు లేదు. ఆ పెట్టెలో జనం ఎక్కువ వున్నారో, సామాను యెక్కువ వుందో నిర్ణయించటం కష్టం. బెదురుతూ తలుపు దగ్గరే నిల్చున్నాను. అన్నయ్య లోపలికి తొంగిచూశాడు.

'ఇక్కడ యెలా కూర్చుంటావు? పోనీ, ఇంటరుకు మార్చుకురానా?'

'ఊహుః. ఇక్కడే కూర్చుంటాను. ఫరవాలేదు. రైలు కదిలితే అంతా సర్దుకుంటారు. అందరూ స్నేహమౌతారు' అన్నాను పట్టుదలతో. ఎదురుగా బల్లమీద ఒక ఆకుపచ్చ చీరె ఆవిడ సీటుమీద పరుపు పెట్టుకొని హాయిగా కూర్చున్నది. నన్నుచూచి 'రండి, కూర్చోండి' అన్నది పరుపు తీస్తూ. అన్నయ్యకు ధైర్యం వచ్చింది.

'మా చెల్లెలు రాజమండ్రీదాకా వెళ్తున్నది. కొంచం చూసుకుంటారా'

'అల్లాగే నాయనా! నేనూ రాజమండ్రి వెళ్ళుతున్నాను.'

అన్నయ్య వెళ్ళిపోయాడు. ఆకుపచ్చ చీరావిడ 'మీ దీపూరేనా' అంటూ మొదలుపెట్టి మామూలు ప్రశ్నలన్నీ వేసి రాజమండ్రి మా పుట్టిల్లో, అత్తవారిల్లో అన్నీ సవిస్తారంగా కనుక్కుంది. అన్నింటికి ముభావంగా జవాబు చెప్పి వూరుకున్నాను. ఆమె ప్రశ్నలలోంచి తేరుకొని పెట్టెఅంతా కలయజూశాను. కిటికీలోనుంచి ఒక బెంగాలీ అమ్మాయి యెవరో బెంగాలీ యువకుడితో జాలిచూపులతో మాట్లాడుతున్నది. వారి విచారవదనాలు చూస్తే వియోగం భరించలేనట్లు తోస్తుంది. భార్యాభర్తలై వుంటారా? ఒక్కక్షణం వారి కథ వూహించుకున్నాను. ఆమె కలకత్తా పుట్టింటికి వెళ్ళుతున్నది. అతను సెలవుదొరకక ఆగిపోయాడు. నవ్వొచ్చింది. ప్రక్కకు తిరిగి చూశాను. అరవసోదరి, పిల్లలూ కాఫీ ఫలహారాల్లో మునిగితేలుతున్నారు. రైలు యెక్కింది మొదలు తినడమే పనిగదా! పాపం! దూరాన అవ్వగారు చోటులేదని సణుగుతున్నది. గంట మ్రోగింది.

అమ్మయ్య! రైలు కదులుతుంది కదా, ఇంకెవరూ ఈ పెట్టెలోకి రారుకదా, అని అందరి ముఖాలు వికసించినవి. కాని ఒక నల్లని ఆసామీ గబగబా వచ్చి తలుపుతెరచి, ఒక పసిపిల్లతల్లినీ, పెట్టె, పక్కచుట్టతో సహా లోపలికి తోసి వెళ్ళాడు.

రైలు కదలింది.

క్రొత్తావిడ, పసిబిడ్డ నెత్తుకొని తలుపుదగ్గరే దిక్కులేనిదానిలాగ నించున్నది. అంతా ఆవిడకేసి ద్వేషంతో చూస్తున్నారు. ఆకుపచ్చచీరావిడ మాత్రం సర్దుకొని మా యిద్దరిమధ్యా చోటిచ్చింది.

నాకు ఆశ్చర్యంవేసింది.

తనకు యిబ్బందిఅనిఅయినా ఆలోచించకుండా ఈ విడ వచ్చినవాళ్ళందరికీ చోటుయిస్తున్నది: రైల్లో, చోటు వున్నాకూడ, చోటులేదు, యింకో పెట్టెలోకి వెళ్ళమని కసిరేవాళ్ళను, సీటుమీద సామానుపెట్టి రాత్రి నిద్రకు స్థలం రిజర్వుచేసుకొని, తియ్యమన్న ప్రతివారితో పోట్లాడే వాళ్ళను, ప్రక్కనున్నవాళ్ళను కారణం లేకుండానే తోస్తూ హింసించేవాళ్ళను చాలామందిని యెరుగుదును. కాని తనకు యిబ్బంది అని అయినా ఆలోచించకుండా పెట్టె లోకివచ్చే ప్రతివ్యక్తికి చిరునవ్వుతో స్వాగతమిస్తూ చోటు చూపించే స్త్రీని చూడటం ఇదే మొదటిసారి. సిగ్గుపడుతూ అన్నాను.

'ఏమండీ, నామూలాన మీకు చాలా యిబ్బంది అయింది. పాపం, ఇంక మీరు రాత్రిఅంతా మేలుకోవాలి.'

ఆకుపచ్చచీరావిడ నవ్వింది.

'ఫరవాలేదండీ, నిద్రకోసం వాచిపోయినామా? ఎంతసేపు, తెల్లవారితే యెవరింటికి వాళ్ళం వెళ్ళిపోతాము. రేపు రోజంతా నిద్రపోవచ్చు. ఇక్కడే వుండిపోముగదా! ఉన్నకాస్సేపు ఒకరికొకరం సాయంచేసుకోకపోతే ఎల్లాగ?'

నేను ఆవిడకేసి నిదానించిచూశాను. మామూలు మనిషే, నలభైయేళ్లుంటాయి. సగంజుట్టు నెరిసింది. వంటి నిండా నగలు. చామనచాయ. ఎందుకో నడివయస్సులో నగలతోనిండిన స్త్రీలను చూస్తే విచారం నాకు. సంస్కారము లేక సంసారగొడవల్లోమునిగి స్వార్థపరులైవుంటారని యేదో పిచ్చిపూహ. కాని, ఇవ్వాళ ఈమె సహజఔదార్యంముందు నా సంస్కారం తలవంచుకున్నది.

రైలు నెల్లూరు దాటింది.

ఎల్లాగో ఎక్కడివాళ్ళక్కడ సర్దుకొని నిద్రకు సిద్ధమైనారు.

ఆకుపచ్చ చీరావిడ లేచినుంచునిక్రొత్తావిడతో అన్నది.

'పిల్లను పడుకోబెట్టండి. నేను ఆ ప్రక్కన సర్దుకుంటాను'

ఆ తల్లి కృతజ్ఞతతో పిల్లను నిద్రపుచ్చింది.

ఎక్కడాచోటులేదు,చాదస్తం.ఎక్కడకూర్చుంటుంది?

'అదేమిటండీ, ఎక్కడా చోటులేదే. ఎంతసేపు నించుంటారు?' అన్నాను.

'ఫరవాలేదు. పిల్లను చేతిలో పెట్టుకొని ఆమె ఎంతసేపు కూర్చుంటుంది. ఎవరో ఒకరు కష్టపడాల్సిందేగా. అందరం పంచుకుందాం.'

నేను సిగ్గుపడ్డాను, నా కెందుకు తోచలేదు?

'మీ రిక్కడ కూర్చోండి, నేను వెళ్ళి తలుపుదగ్గర నిల్చుంటాను, నాకు కిటికీలోనుంచి చూడటం చాలాసరదా' అన్నాను లేస్తూ. ఆమె ఒప్పుకోలేదు.

'చిన్నదానివి. నీవు నిద్రపో, నాకు ఫరవాలేదు'

ఎట్లాగో బలవంతంమీద ఆమెను కూర్చోపెట్టి నేను తలుపు దగ్గరికి చేరాను.

ఎప్పుడు రైల్లోవున్నా నాకు కిటికీదగ్గరనుంచి బయట ప్రకృతినీ, లోపల మనుష్యప్రకృతినీ చూస్తూ కాలం గడపటం సరదా. కాని యీ చీకటిలో బయటప్రకృతి నిర్జీవమైంది లోపల మానవలోకం నిద్రపోతున్నది. బయట మిణుగురులు ధగధగ మెరుస్తూ మాయమాతున్నవి. లోపల బెంగాలీ యువతి కళ్ళు కన్నీటితో తళతళలాడుతూ యెవరినో వెతుక్కుంటున్నాయి. నేను ఊహాప్రపంచంలో మునిగిపోయాను. నిల్చునే నిద్రపోయినానేమో!

తెల్లవారింది.

పెట్టె కలకలలాడింది.

గోదావరి హోరు! బ్రిడ్జిమీద రైలుమోత!

అమ్మయ్య! రాజమండ్రి!!!

# శుక్రవారం

శుక్రవారం అమ్మ వస్తానని చెప్పి పోయింది.

తను అక్కడికి వచ్చి వారంరోజులే అయింది. తనను దిగబెట్టి పెద్ద హాలులో వెడుతో వెడుతో అమ్మ చెప్పింది 'ధైర్యంగా ఉండు. మళ్ళీ శుక్రవారం వచ్చిచూస్తాను' అని. వస్తానంది కాని ఎన్ని గంటలకో చెప్పలేదు. ఇవ్వాళే రావాలి. ప్రొద్దుటినుంచి తను ఎదురుచూస్తూనే ఉన్నాడు. లోపలికి పోనేలేదు. గేటుదగ్గర బండమీద కూర్చున్నాడు. దూరంనుంచే తను అమ్మకి కనుపించాలి. తను కనపడకపోతే అమ్మ వెళ్ళిపోతుందేమో! ఏమిటో భయం!

అమ్మ ఇల్లు ఇక్కడి కెంత దూరమో! ఎన్నో మైళ్లు ఉండవచ్చు. ఈ శరణాలయానికి వచ్చేటప్పుడు తనూ అమ్మా ఏదో బండి ఎక్కి వచ్చారు. ఆ బండి సందులు గొందులు తిరిగితిరిగి ఏ గంటకో ఇక్కడికి చేరింది. ఇప్పుడసలా త్రోవ కూడ తనకి జ్ఞాపకంలేదు. అమ్మ వస్తేనేగాని తను వెళ్ళలేడు. అయినా అసలు ఇక్కడినుంచి తనను వెళ్ళనీయరుగా! గేటు దాటి ఎక్కడికీ వెళ్లకూడదు. ఎవరో ఒకరు చూస్తూనే ఉంటారు. ముఖ్యంగా ఆ కళ్లజోడు ఆయన. ఆయనకి ముక్కుమీదనే కోపం. ఎప్పుడూ ఏదో వంకచూసుకొని కసురుతూనే ఉంటాడు. ఆయన ఉంటే అసలు ఎవరూ అల్లరి చేయరు.

ఇక్కడికి రాకముందు అమ్మా తనూ ఒక చిన్న ఇంట్లో ఉండేవారు. అందులో ఒక్కటే గది. వెలుతురు లేక పోయినా ఆ గది ఎంతో శుభ్రంగా ఉండేది.

అమ్మ ప్రొద్దునే లేచి ఇల్లంతా శుభ్రంగా అలికి ముగ్గులుపెట్టేది. రకరకాల ముగ్గులు ఎంతో అందంగా ఉండేవి! ఆ తరువాత తనకి నీళ్ళుపోసి తల దువ్వి శుభ్రంగా ఉతికిన చొక్కా తొడిగేది. ఆవిడా తలదువ్వుకొని పసుపు రాచిన ముఖంమీదనే దమ్మిడీఅంత బొట్టు పెట్టుకొనేది. ఆ తరువాత గంప తీసుకొని పెద్ద అంగడిదగ్గరకు వెళ్ళి నిలుచునేది. వెనకాలే తనూ వెళ్ళేవాడు. మధ్యాహ్నందాకా అక్కడే ఉండేవాళ్ళు. ఆ అంగడికి రోజూ ఎంతోమంది వచ్చేవాళ్ళు. రకరకాలవాళ్ళు అక్కడ ఎన్నో సరుకులు కొనేవాళ్ళు. ఎక్కువై మోసుకుపోలేకపోతే అమ్మను పిలిచేవాళ్లు. అమ్మ ఆ సరుకులు అన్నీ గంపలో పెట్టుకొని వాళ్ల వెనకాలే వెళ్లేది. తనూ వెళ్లేవాడు. సందులుగొందులు తిరిగి తిరిగి వాళ్లవాళ్ల ఇండ్లల్లో సరుకులు దింపి డబ్బులు తెచ్చుకొనేవాళ్లు.

అక్కడికో నీలంచీర అమ్మాయి తరుచు వచ్చేది: మెడలో ఒకసంచివేలాడవేసుకుని, నల్లడబ్బాలు, తెల్లడబ్బాలు, పేనాలు ఏవేవో చాలా కొనేది. కాని అమ్మని ఎప్పుడూ పిలిచేది కాదు. అన్నీ తనే సంచిలో వేసుకుని వెళ్ళిపోయేది.

ఇంకో బట్టతలాయన వచ్చేవాడు. ఆయన ఏమీ ఎక్కువగా కొనకపోయినా, కొన్నది ఒక్కసరుకే ఐనా

ఎప్పుడూ అమ్మను తప్పక పిలిచేవాడు. ఆ ఒక్క పొట్లము అమ్మచేతి కిచ్చి దర్జాగా ముందు నడిచి వెళ్లిపోతుండేవాడు.

ఆయన తల తమాషాగా ఉండేది. చుట్టూ ఒత్తుగా జుట్టు ఉన్నా మధ్యన తెల్లగా బిళ్లలా బట్టతల ఉండేది. ఆయన ఇల్లుకూడా తనకి బాగా తెలుసు. పేటలో పార్కు కెదురుగా ఉండేది. ఎవరూ ఉండేవాళ్లు కాదు. ఎప్పుడూ తలుపులు మూసిఉండేవి. ఒక జాతికుక్క మాత్రం ఎప్పుడూ 'భౌ_భౌ' మంటూ ఎదురు వస్తూండేది. ఆయన కాళ్లకు పెన వేసుకుపోతుండేది.

త్రోవలో ఆయన ఏదైనా అప్పుడప్పుడూ అమ్మతో మాట్లాడుతుండేవాడు. 'మీా దీఊరేనా? ఎన్నాళ్లుగా ఇక్కడ ఉంటున్నావు' అని. అమ్మ ఏదో చెబుతూ ఉండేది. ఒకసారి నాన్నను గురించి చెప్పింది. 'నాలుగేళ్ళుగా దేశం పోయి నాడు బాబూ! జాడలేదు' అని, చెబుతూ ఉంటే అమ్మ గొంతు జీరబోయింది.

తను ఇక్కడికి రావడానికి కూడా ఆ బట్టతలాయనే కారణం.

ఆయన ఒకరోజు అడిగాడు: 'నీ కొడుక్కు ఎన్నేళ్లు' అని. 'అయిదేళ్లు బాబు!' అని అమ్మ చెప్పింది.

'చదువు చెప్పించటంలేదూ? బళ్లో చేర్పించరాదూ' అన్నాడు ఆయన'

అమ్మ ముఖం చిన్నబుచ్చుకుంది 'నాకేం తెలియదు బాబూ! ఎవరు చేర్చుకుంటారు?' అన్నది.

ఈ సారి ఆయన కొంచెం దగ్గరగా వచ్చి చెప్పాడు: 'ఇక్కడ నాకు తెలిసిన స్కూలు ఒకటి ఉన్నది. అందులో చేర్పించు. బీదవాళ్లైతే ఉచితంగా అన్నంపెట్టి చదువు చెబుతారు. కావలిస్తే నేను అక్కడ మేనేజరుకు ఉత్తరం వ్రాసి ఇస్తాను.'

ఆ తరువాత వారంపదిరోజులకే అమ్మ ఒక ఉత్తరం తీసుకొని తనని ఇక్కడ చేర్పించి వెళ్ళింది.

వచ్చిన రోజు తన కిక్కడ చాలా భయంవేసింది. సాయంత్రం ప్రొద్దుగూకుతూఉండగా అమ్మ తనని ఇక్కడకు తీసుకువచ్చింది. పెద్దహాలులో బల్లదగ్గరగా కళ్ళజోడు ఆయన కూర్చుని ఉన్నాడు. హాల్లో మసకమసకగా చీకటి పడుతోంది. ఇంకా దీపాలు వెలిగించలేదు.

కళ్ళజోడుఆయన అమ్మ నేవో ప్రశ్నలు అడిగాడు. ఉత్తరం చూచుకున్నాడు. పుస్తకంలో ఏదో రాసుకున్నాడు.

'జోగూ! ఇల్లా రా. ఈ అబ్బాయిని తీసుకువెళ్ళు!' అని పెద్ద గొంతుకతో జవాన్ను పురమాయించాడు.

అప్పుడే చెప్పింది అమ్మ: 'ధైర్యంగా ఉండు. మళ్లా శుక్రవారం వస్తాను' అని.

తనకేమీ తోచలేదు. భయంవేసింది. గట్టిగా అరవాలనిపించింది నోరు పెగలలేదు. ఏడుపొచ్చింది కాని, కంట నీరురాలేదు. కొయ్యబొమ్మలా అలా చూస్తూ ఉండిపోయాడు. అమ్మ వెళ్ళిపోయింది.

తరువాత ఏమైందీ తనకి బాగా జ్ఞాపకంలేదు. రాత్రి పైన హాలులో అంతా వరుసగా పడుకున్నారు. హాలు సందు

లేకుండా నిండిపోయింది. అందరూ నిద్రపోతున్నారు. తనకి మాత్రం నిద్దరపట్టలేదు.ఇంటికప్పు కేసిచూస్తూ పడుకున్నాడు. దీపం మసకగా వెలుగుతోంది.

రోజూ, ఇంట్లో గుమ్మంముందు అమ్మా తనూ ఆకాశాన ఉన్న చుక్కలను చూస్తూ పడుకునేవాళ్లు. అమ్మ కథలు చెప్పేది. తను వింటూ వింటూ నిద్రపోయేవాడు.

ప్రక్క సందులో కుక్కలు తెల్లవార్లు అరుస్తుండేవి. వెనక ఇంట్లోంచి అత్తా కోడలు గట్టిగా పోట్లాడుకునేవాళ్లు. అయినా, తనకి నిద్రపట్టేది. ఇప్పుడు ఇక్కడ నిద్రపట్టడంలేదు.

ఉన్నట్టుండి ఏదో సన్నగా నవ్వు వినిపించింది. తను ఉలిక్కిపడ్డాడు. అవతల పక్కమీదనుంచి ఓ చిన్న పిల్ల తనకేసి నిదానించి చూస్తోంది. చిరునవ్వు నవ్వుతోంది. సన్నంగా, తెల్లగా ఉంది. తెల్లపరికిణి, తెల్లచొక్కా తొడుక్కుంది. సరిగా తనంత ఎత్తే ఉంటుంది. నవ్వితే బుగ్గలు రెండూ గుంటలుపడుతున్నాయి. మెల్లిగా అడిగింది: 'నీ పేరేమిటి' అని.

'రాము' అన్నాడు తను.

ఏదో జ్ఞాపకంవచ్చింది. మళ్లా మాట్లాడలేదు.

రెండు నిమిషాల తరువాత, తను మళ్లా అడిగాడు: 'నీ పేరో?' అని.

'కాంత' అని చెప్పింది, నవ్వుతో అవతలికి జరిగి వత్తిగిలిపడుకుంది. తనూ కళ్ళు మూసుకున్నాడు. నిద్రపోయాడు.

అప్పటినుంచీ, తనూ కాంత ఎప్పుడూ కలిసే ఉండే వాళ్లు. చదువుకునేవాళ్లు.

తనకి ఈ స్కూలు బాగానే ఉన్నది. పెద్ద తోటలో మధ్యన ఎత్తుగా తెల్లగా కోటలా వుంటుంది. చుట్టూ గుంపులుగా కొబ్బరి చెట్లు, వాటికి దూరాన పెద్దపెద్ద పువ్వుల చెట్లు, పున్నాగపూలు, పొగడపూలు, నాగుమల్లె—ఇంకా ఎన్నో! చెట్లక్రింద ఎప్పుడు చూసినా ఒత్తుగా రాలి ఉంటాయి.

తనూ, కాంత రోజూ అక్కడే ఆడుకుంటారు. పూలన్నీ తను ఏరి యిస్తే కాంత రకరకాలుగా దండలు కడుతుంది. ఎంత ప్రయత్నించినా తనకు దండలు కట్టడం మాత్రం చేతకాదు.

వచ్చిన మర్నాడే తను కాంతని అడిగాడు, 'ఇవ్వాళ ఏవారం' అని.

కాంత, తల ఎగరేసింది. 'ఏమో! మంగళవారం కాబోలు!' అన్నది.

తను మళ్ళీ అడిగాడు, 'శుక్రవారం ఎప్పుడువస్తుంది?' అని.

కాంత తలతిప్పింది. వేళ్ళు లెఖ్ఖపెట్టుకుంది. 'ఇంకా మూడు రోజులకి' అంది.

తను మాట్లాడలేదు. ఇద్దరూ చెట్టుకింద ఇసుకలో ఆడుకుంటున్నారు. గుప్పిట్లోకి తీసుకున్న ఇసక వేళ్ళ సందుల్లోనుంచి జారిపోతోంది. రాలిన పూవులు మాత్రం చేతిలో నిలిచాయి.

.. ఇవ్వాళే శుక్రవారం,

తను రోజులు లెఖ్ఖపెట్టుకుంటూనే ఉన్నాడు. ప్రొద్దున కళ్ళజోడు ఆయన కూడా చెప్పాడు. 'ఇవ్వాళ శుక్రవారం. అందరూ త్వరగా స్నానంచేసి తొమ్మిదింటికి పూజగదిలోకి రావాలి' అని.

జోగూ కూడా చెప్పాడు: 'ఇవ్వాళ శుక్రవారం. అందరూ మంచి బట్టలు కట్టుకోవాలి' అని.

ఇవ్వాళే అమ్మ వస్తానంది. ప్రొద్దుటినుంచి తాను ఎదురుచూస్తున్నాడు. .... ప్రొద్దుగూకవచ్చింది. అమ్మ ఇంకా రాలేదు.

చీకటిపడితే తనని గేటుదగ్గర కూర్చోనీయరు. లోపలికి పోవాలి. అమ్మ రాకూడదూ!

దూరాన చెట్ల గుంపులో రైలుబండి మెలికలు తిరిగి పాములా సాగిపోతోంది. రైలుకూత వింటే తన కేదో భయమేస్తుంది. బెంగగా ఉంటుంది. ఎప్పుడో నాన్న రైలెక్కి వెళ్ళాడు. రైలుకూసింది. బండి కదిలింది. నాన్న మళ్ళా రాలేదు.

కాంత ప్రొద్దునే వాళ్లింటికి వెళ్లింది. ఇంకా రాలేదు. చీకటిపడింది. అమ్మ ఇంక రాదేమో! జోగూ ఇంక తన కోసం వస్తాడు. తను లోపలికి పోవాలి.

ఏదో బస్సు ర్రంయ్‌మని వచ్చి ఆగకుండా వెళ్ళి పోయింది. అమ్మ ఇంక రాదు.

తను లేచి వెళ్ళబోతుంటె కాంత వెనకాలే వచ్చి నెత్తినపడింది. అని. 'అబ్బ' 'ఎప్పుడు వచ్చావు' అన్నాడు.

'ఇప్పుడే! నువ్వు చూడనేలేదు' అన్నది.

నవ్వుతో కలకలలాడుతూ ఉంది కాంత. తలంటుకొని కొత్తబట్టలు కట్టుకొంది.

ఇద్దరూ లోపలికి వెళ్లారు.

ఒక్కనిమిషం ఆగి, కాంత అన్నది, 'మా ఇంటికి కొత్త అమ్మ వచ్చింది!' అని

తను ఉలిక్కిపడ్డాడు. 'కొత్త అమ్మా! కొత్త అమ్మ ఏమిటి?' అని అడిగాడు.

కాంత చెప్పింది: 'అవును. మా అమ్మ ఎక్కడికో వెళ్ళిపోయింది. మళ్లీ రాలేదు. నేను ఇంట్లో గొడవచేసి ఏడుస్తూంటే మా నాన్నగారు ఈ స్కూలులో చేర్పించారు'.

కాంత ముఖం వాడిపోయి కనుకొలుకుల్లో నీరు నిలిచింది.

తనకు దిగులేసింది.

మాట్లాడకుండా, కాంతచేయి పట్టుకున్నాడు. ఇద్దరూ స్కూలులోపలికి వెళ్ళుతూంటె కళ్ళు తుడుచుకొని కాంత అన్నది: 'ఇవ్వాళ మా ఇంట్లో, ఇంకో అమ్మ ఉంది. నాకు తలంటిపోసింది. మిఠాయి వండిపెట్టింది.'

తను మాట్లాడలేదు. 'మా అమ్మ ఇవ్వాళ వస్తానంది రాలేదు' అని చెప్పాలనుకున్నాడు. చెప్పలేదు.

ఆ తరువాత అమ్మ ఎప్పుడు వచ్చేది తనకు తెలియలేదు. మళ్ళా శుక్రవారం వస్తుందేమో అనుకున్నాడు. మూడు శుక్రవారాలు వచ్చి పోయినాయి.

అమ్మ ఇంక రానేరాదేమో ననిపించింది. తను ఎదురు చూడడం మానేశాడు.

తను చదువుకుంటున్నాడు. పిల్లలతో ఆడుకుంటు న్నాడు. కాని మనస్సులో మూగబాధ అల్లానే ఉండిపో యింది.

ఆఖరుకి ఒక శుక్రవారం తను పూజగదిలోనుంచి బయటికి వస్తుంటే జోగు పిలిచి చెప్పాడు.: 'అదుగో! మీ అమ్మ వచ్చింది. నిన్ను ఇంటికి తీసుకువెళ్లుతుందిట' అని.

తనకి ప్రాణం లేచివచ్చింది. పెద్ద హాల్లో అమ్మ తన కోసం ఎదురుచూస్తోంది మునపటిలా లేదు చాలా మారి పోయింది. మంచి చీరకట్టుకొంది. కళ్ళనిండా కాటుక పెట్టు కొంది. ఎంతో అందగా ఉన్నదనిపించింది తనకళ్లకి.

గబగబ వెళ్ళి అమ్మని కావిలించుకున్నాడు. అమ్మ తన చెయ్యిపట్టి బయటికి తీసుకువెళ్ళింది. వెళ్లుతో వెళ్లుతో కళ్ళజోడు ఆయనతో చెప్పింది. 'సాయంత్రం మళ్ళీ తీసుకు వస్తాను' అన్నది.

త్రోవలో, అమ్మ తనతో అన్నది. 'మూడు వారాలుగా నాకు రావటానికి వీలేలేకపోయింది నాయనా! నేను ఇప్పుడు పార్కుదగ్గర బాబుగారింట్లో పనిచేస్తున్నాను. రోజూ ఏదో పనితో సరిపోతున్నది, తీరిక లేదు.'

అమ్మమాటలు తన కర్థంకాలేదు. మాట్లాడకుండా అమ్మచేయి పట్టుకొని, ఊరుకున్నాడు.

తరువాత, అమ్మ తన స్కూలును గురించి ఇంకా ఏవో ఏవో అడిగింది. తను ఏదో చెప్పాడు. అమ్మ తనని ఇంటికి తీసుకుపోలేదు. పార్కుదగ్గర బట్టతలాయన ఇంటికి తీసుకుపోయింది. 'నేను ఇప్పుడు ఇక్కడే ఉంటున్నాను' అని చెప్పింది.

ఆ ఇంటిలోపలకి తను అదివరకెప్పుడూ వెళ్ళలేదు. ఇంటిముందు వరండా మాత్రమే తను ఎరుగును. ఆ ఇంటి వెనక కాల వేరే రెండు గదులు విడిగా ఉన్నాయి. అమ్మ తనని అక్కడికి తీసుకువెళ్ళింది. వెళ్ళగానే వంట వగైరా ఏవో పనులు చూచుకోవడం మొదలుపెట్టింది. ముందు ఇంట్లోకి ప్లేటులో ఏవేవో పెట్టి తీసుకుపోయింది. మళ్ళీవచ్చింది మళ్ళీ వెళ్ళింది. తనుఒక్కడూ దొడ్డివేపు తోటలోకి చూస్తూ కూర్చున్నాడు.

చాలసేపటికి, అమ్మ తనకూ అన్నంపెట్టింది. ఏవేవో వేసి పెట్టిందిగాని తనకి సయించలేదు. అన్నం తిని తను ముందు గదుల్లోకి వెళ్ళబోయినాడు. కాని అమ్మ పోనీయ లేదు. ఆయన నిద్దరపోతున్నారు. వెళ్ళి అల్లరిచేయకు అన్నది. తనకి ఏమీ తోచలేదు. స్కూలుకి వెళ్ళిపోతే బాగుండునని పించింది. ఆలోచిస్తూ తను నిద్దరపోయాడు.

సాయంత్రం అమ్మ స్కూలుగేటుదాకా తీసుకువచ్చి విడిచివెళ్ళింది. 'నాకు పని ఉంది. నువ్వు వెళ్ళు' అని త్వరగా వెళ్ళిపోయింది.

తనకి ఏదో పారవేసుకున్నట్లు తోచింది. తన వస్తువేదో ఎక్కడో జారిపోయినట్లు తోచింది. దానికోసం ఎక్కడ వెతకాలో తెలియలేదు. నిరుత్సాహంగా లోపలికి వెళ్లాడు.

కాంత ఎదురువచ్చింది. 'ఇంటికి వెళ్ళివచ్చావా'అని ఉత్సాహంగా అడిగింది. 'ఆ' అన్నాడు నీరసంగా.

ఒక్క నిమిషం ఆగి చెప్పాడు 'మా అమ్మ మా ఇంట్లో లేదు. పార్కు దగ్గర బాబుగారింట్లో ఉంటోంది' అని.

'ఏ పార్కు? పెద్దపార్కా? అక్కడే మా ఇల్లూ' అన్నది కాంత. 'అల్లాగా' అన్నాడు తను. ఆ మాట సరిగా వినిపించుకోలేదు.

చాలారోజులదాకా అమ్మ మళ్ళీ రాలేదు.

ఒకరోజు తనూ కాంతా తక్కిన పిల్లలు చెట్టుకింద ఆడుకుంటున్నారు. దూరాన బట్టతలాయనా, ఆయన వెనకాలే అమ్మ వస్తున్నారు.

చటుక్కున కాంత 'అదుగో! నాన్న! అని ముందుకు పరుగెత్తింది. తను తెల్లబోయినాడు.

ఇంతలోకి అమ్మ తనకు దగ్గరగా వచ్చింది. 'ఆయన నిన్ను ఇంటికి తీసుకుపోవటానికి వచ్చారు బాబూ! ఇన్నాళ్ళు ఊళ్ళో లేరు. ఏదో పనులమీద తిరుగుతున్నారు!' అన్నది.

తను ఆయనకేసి చూచాడు. కాంత తండ్రిదగ్గర చేరింది. కాంతను ఎత్తుకొని అమ్మతో ఆయన అన్నాడు. 'మా కాంతను కూడా ఇంటికి తీసుకుపోతాను'.

తను తలవంచుకున్నాడు. 'నేను రాను!' అన్నాడు బిగ్గరగా, ధైర్యంగా.

కాంత తండ్రిచంకలోనుంచి మెల్లగా జారి, 'నేనూ రాను' అన్నది.

కాంత తనదగ్గరకు వచ్చి నుంచుంది. పిల్లలంతా చూట్టూ చేరారు. 'అబ్బే! రామూను, కాంతనీ మేము పోనియ్యం!' అన్నారు.

లోపల్నించి కళ్ళజోడు ఆయన వచ్చాడు. అమ్మనీ బట్టతలాయన్నీ చూసి అన్నాడు. 'పోనియ్యండి. ఇక్కడే ఉండనియ్యండి. ఇక్కడే చదువుకుంటారు'.

అమ్మా, బట్టతలాయన ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. కొంచెంసేపుండి, వెళ్ళిపోయినారు.

తను కాంతచెయ్యి పట్టుకున్నాడు. కాంత వేళ్ళు తన గుప్పిట్లో ముడుచుకుపోయినాయి. మళ్ళా తెరుచుకొని తన వేళ్ళని పెనవేసుకున్నాయి.

ఎక్కడనుంచో ఉన్నట్టుండి, చల్లనిగాలి వీచింది. పైనుంచి పొగడపూలు జలజల రాలినాయి.

19]

# ఎఱ్ఱగన్నేరు పువ్వు

అప్పుడే వాన కురిసి వెలిసింది. మబ్బులచాటునుంచి పొంచి చూస్తున్నాడు సూర్యుడు. వాన చినుకులకు తడసిన తోటంతా నీరెండలో తళతళలాడుతోంది.

అది చాలా పెద్ద తోట. ఆ తోటలో ఓ మూల ఓ చిన్న గులాబి మొక్క బలహీనంగా గాలికి రెప రెప లాడుతూ ఉంటుంది.

ఆ ప్రక్కనే పొదలా పెరిగిన ఎఱ్ఱ గన్నేరు చెట్టు, తెల్లవారేసరికి చెట్టంతా గుత్తులు గుత్తులుగా నిండి ఉం డేవి పూలు.

గులాబీ పూవులు పూసేది: ముచ్చటగా మూడో నాలుగో!

రోజూ, ఆ తోటలోకి ఎందరో వచ్చేవారు, రకరకాల వారు! అందరూ తప్పనిసరిగా ఆ గులాబీ మొక్క దగ్గర ఆగిపోయేవారు. వందిమాగధులవలె ఆ గులాబీ పూల సౌందర్యాన్ని పొగిడేవారు, ఆ సౌందర్యంలో ఒక్క నిమి షం తన్మయులై, ముందుకు సాగిపోతుండేవారు.

రోజూ యీ చోద్యం అంతా ప్రక్కనున్న గన్నేరు పువ్వు కనిపెడుతూ వుండేది. దూరాన్నుంచి వారి మాటలు ఆ పువ్వుకి సగం సగం మాత్రమే వినపడేవి.

కాని ఆ మాటలు వింటూ ఆ పువ్వు అనుకునేది!

'ఎంత అదృష్టం! ఎంతమంది ఈ గులాబీపూల సౌం దర్యానికి ముగ్ధులౌతున్నారో? ఒక్కరూ ఇటువైపు చూడ నైనా చూడరు...తనకూ గులాబీకి ఏమిటి తేడా? తను మాత్రం అంత అందంగానూ లేదూ? అయినా....'

విచారంతో నిట్టూర్చి మళ్లీ ఆశగా అనుకునేది. 'అబ్బా! ఒక్కరోజు ఆ గులాబీపూలతో కలిసిపోగలిగితే! ఒక్కసారి వాటితో బాటు ఆ పొగడ్తలని పంచుకోగలిగితే! అబ్బా! ఒక్కరోజు! !

అనుకోకుండా ఆ పూవు కోరిక ఫలించింది. ఉన్న ట్టుండి, చల్లని గాలి వెల్లువగా వీచింది. ఆ గాలి సందడిలో గన్నేరుచెట్టు గలగలమని కదలిపోయింది.

ఓ గన్నేరు కొమ్మ వంగి గులాబి మొక్కను ముద్దు పెట్టుకొన్నది...గన్నేరుపువ్వు గులాబీఆకులమధ్యన చిక్కు బడిపోయింది.

ఆ పూటకి తనూ ఓ ఎఱ్ఱగులాబీపువ్వై సంతోషిం చింది. ఆకులసందున ఒదిగి ఆనందించింది.

కాస్సేపటికి, ఇద్దరు స్నేహితులు వచ్చారు తోటలోకి. అనుకున్నట్లుగానే ఆ గులాబీ మొక్కదగ్గర ఆగిపోయారు.

వారిలో ఒకతను అన్నాడు, 'ఓహో! ఎంత అంద మైన గులాబీ! !, చక్కని రోజా, చల్లని రోజా'...

ఓ! ఈ పువ్వుమీద మంచి పద్యం రాయ వచ్చోయ్!.

'ఓస్, పద్యమేమిటోయ్! ! అసలు దీనిని గురించి చక్కని కథ వ్రాయవచ్చు!' అన్నాడు, కవిత్వం అంటె అంత మోజులేని అతని స్నేహితుడు.

మొదటి అతను అందుకున్నాడు: 'నువ్వేమైనా చెప్పు. పద్యం అందం గద్యానికి రాదోయ్!'

'అదేమిటోయ్! దేని అందం దానికే' అన్నాడు, రెండో అతను తీక్షణంగా. ఎంతకూ ఆ వాదన తెగలేదు. వాదించుకుంటూనే అక్కడనుంచి వెళ్ళిపోయారు వారిద్దరు. గన్నేరుపువ్వుకి నిరుత్సాహం కలిగింది. పాపం! వాళ్ళు పువ్వులను గురించి ఏమి చెప్పుకుంటారో విందామని ఆశగా కని పెట్టుకున్నది! వారు పువ్వులకేసి తిరిగిచూడనైనా చూడలేదు!

ఈ సారి, ఓ అబ్బాయి, అమ్మాయి వచ్చారు. ఆ అమ్మాయి అతి సంతోషంతో అన్నది: 'అబ్బ! ఎంత బాగున్నాయో ఈ గులాబీపూలు!'

'నీ ముఖంకంటేనా ?' అన్నా డతను, — ఆప్యాయంగా.

'నిజంగా!' ఆనందంతో ఆమెముఖం వికసించింది.

సిగ్గుతో, సంతోషంతో ఆమె చెక్కిళ్ళు ఎఱ్ఱపడి గులాబీరేకులవలె నిగనిగలాడినవి.

అతనిచేత ఆమాట అనిపించుకోనడం కోసరమే అక్కడికి వచ్చినట్లు ఆమె ముందుకు సాగిపోయింది.

ఆమె వెనకాలే అతనూ వెళ్లాడు.

వారిద్దరూ మళ్ళా గులాబీచెట్టుకేసి చూడలేదు.

గన్నేరు పువ్వుకి పూర్తిగా నిరాశ కలిగింది. గులాబీ పూవులేమి గుసగుసలాడుకుంటున్నాయో విందామని ఆకు లలోనుంచి మెడ ముందుకు వంచింది.

పూలగంప తీసుకొని తోటమాలి వచ్చాడు. ఆకు లతో పాదివి పట్టుకొని పువ్వులు అన్నీ కత్తిరించి బుట్టలో పడేశాడు. గన్నేరు పువ్వుకూడా ఆ సమూహంలో కలిసి పోయింది. తోటమాలి గంప బంగళాలోకి తీసుకువెళ్ళాడు.

ఇంటి ఇల్లాలువచ్చి, బుట్ట అందుకున్నది.

పువ్వులన్నీ మెత్తని తివాసీమీద కుప్పగాపోసి, అనేక రకరకాల పూల సెజ్జలలో రకరకాలుగా, అందంగా, అమ ర్చింది. తరువాత ఒక్కొక్కటీ పట్టుకెళ్ళి, వేరు వేరు గదు లలో బల్లలమీద పెట్టింది.

అందమైన గదిలో, అందమైన బల్లమీద, అందా లొలికే పువ్వులతో కలిసిపోయింది, గన్నేరుపువ్వు.

చలనంలేని వస్తువులను చూస్తూ, నిర్మానుష్యమైన గదిలో అట్లానే వుండిపోయింది చాలా సేపు.

ఒక నిమిషం, రెండు నిమిషాలు, గంట, రెండు గం టలు – కాలం గడచిపోయింది.

...గన్నేరు పువ్వుకు విసుగెత్తి విచారమేసింది.

'ఏమిటి యీ బంధన! ఇక్కడనుంచి విముక్తి లేదా? ఈ జీవితం యిక్కడే ముగిసి పోతుంది కాబోలు!!'

కన్నీరు బొట బొటా రాల్చింది గన్నేరు పువ్వు. హాయిగా పచ్చనితోటలో ఆకులసందున, గుత్తులు గుత్తు లుగా వ్రేలాడే పువ్వుల సరసన, ఆకాశంకేసి చూస్తూ,

గాలికి వూగిపోతూ, జీవితం ఎంత మనోహరంగా వుండేది! ఒక్క రోజైనా గులాబిపువ్వు అనిపించుకోవాలని తనకి కోరికే లేకపోతే!!

ఆ రాత్రి గడచి తెల్లవారింది. ప్రొద్దున్నే, పనిమనిషి యిల్లంతా సర్దుతోంది. కుర్చీలు, బల్లలు, అన్నీ తుడిచి పూల సజ్జలలోని వాడిన పువ్వులన్నీ కిటికీలోంచి గిరవాటేసింది.

సరిగ్గా గులాబీ మొక్క ఎదురుగానే పడింది, గన్నేరు పువ్వు.

అప్పుడే ఓ ఎఱ్ఱ గులాబీ మొక్క విరిసింది.

మెత్తని పట్టుకుచ్చులలాంటి రేకులతో తళ తళ లాడుతూ, సౌందర్యం ఎఱ్ఱగా ఆకుల దొన్నెలో కుప్పపోసి నట్లుంది.

చల్లగా బంగారపుటుయ్యాలలోలా, అటూ, ఇటూ, అతి సుకమారంగా కదులుతూ, నలు దిక్కుల అందాన్ని వెదజల్లుతోంది గులాబి పువ్వు.

జాలిగా, చూసింది ఆ పువ్వుకేసి గన్నేరుపువ్వు.

కొనవూపిరితో నీరసంగా అన్నది, ఎఱ్ఱ గులాబి పువ్వుతో:

'నీ జీవితం ఏమవుతుందో నాకు తెలుసులే!...'

ఎఱ్ఱ గులాబీకి ఈ మాటలు వినబడ లేదు. మౌనంగా, గంభీరంగా ఆకాశంలోకి చూస్తూ వూరుకుంది, ఆ పువ్వు.

పరిపూర్ణ సౌందర్యం ఆ క్షణంలో, పరిపూర్ణానం దంలో మునిగివుంది, అంతే!

# కల్పన

అప్పుడే తెల్లవారింది. ముందర వసారా నానుకొని ఉన్న చెట్లతోపులోనించి పక్షుల కిలకిలారావాలు మేలు కొలుపులులాగ వినపడుతున్నాయి.

మాలతికి ఇంకా నిద్ర పూర్తిగా మెళుకువరాలేదు. మత్తుగా పడుకొని, కిటికీ ఊచలవేపు చూస్తో, ఏదో అంతు లేకుండా ఆలోచిస్తోంది. ఆలోచన ఒకచోట అగడం లేదు. ఎక్కడెక్కడికో పరుగెత్తి, ఎక్కడో మాయమై, మళ్లీ మరొక చోట తల ఎత్తుతున్నది.

నిన్న ఈపాటికి ఏం చేస్తోంది? ఎంత కంగారుపడు తోంది! ఆ బాధకి మళ్లీ తెల్లవారి తాను నిలబడగలదని అనుకోలేదు. వచ్చినది కాస్తతలనొప్పి అయినా, అది నరాలను కదలించి వదలిపెట్టింది. తాను డాక్టరైనాకూడా అదేదో బ్రెయిన్ ఫీవరేమోనని తానే భ్రాంతిపడినది. ఆ రోజుతో తన బ్రతుకు అంతమాత్రుం దేమోనని భయపడినది.

ఈ మానవజీవితం నీటిబుడగలమీాద కట్టుకున్న సౌధం వంటిది. ఏ నిమిషాన కూలిపోతుందో తెలియదు. ఏ మాత్రపు గాలి కదలినా, హృదయం చలించి రెప రెప లాడుతుంది. అదే ఆఖరు క్షణమేమో ననిపిస్తుంది అయినా, ఈ మేడచుట్టు, ఈ బ్రతుకును పెనవేసుకొని ఎన్నో కోరికలు, ఎన్నో ఆశలు, ఎన్నో ఊహాలు తీగెలుసాగి అల్లుకొన్నాయి. వాటినుంచి విముక్తి లేదు.

నిన్న తలనొప్పితో బాధతో పడుకొనిఉంటే, పక్క-ఇంటి రంగమ్మగారు తనని చూడటానికి వచ్చింది. ఒంటరిగా ఈ ఊళ్లో ఎడారిలా బ్రతుకుతున్న తన జీవితానికి ఆవిడే ఆప్తబంధువు. ఆవిడ వెళ్ళనిచోటులేదు. ఎంత చుట్టూ గిరిగీచుకొని దూరంగా తొలగిపొయ్యేవాళ్ళయినా, ఆమె స్నేహానికి లోబడక తప్పదు.

ఇంట్లో అడుగుపెడుతూనే ఆవిడ అన్నది: 'ఒంట్లో బాగుండలేదా ఏమిటి? ఇందాకా మా మనుమడు నువ్వు ఎక్కడా కనపడలేదని అన్నాడు.'

తను పైకి ఏదో ధైర్యంగా అన్నది 'ఆఁ ఏదో తల తిరుగుతున్నది. అదే తగ్గిపోతుంది లెండి' అని. రంగమ్మ ఊరుకోలేదు. 'నువ్వు ఎంత డాక్టరువైనా నీ మందు నీకు పనికిరాదులే. మావాడిని పిలవనా' అన్నది.

ఆవిడ మనుమడు కరుణాకరం కూడా డాక్టరే. ఏదో వంక కల్పించుకొని తనతో మాట్లాడాలని తాపత్రయపడు తూంటాడు. ఆ సంగతి రంగమ్మకు కూడా తెలుసు. అందు కనే తను చెప్పకపోయినా వెళ్ళి అతనిని పిలుచుకువచ్చింది. అతనూ, ముందర ఖంగారుపడి, తరువాత ఏదో ఇంజక్షన్ ఇచ్చాడు. దానితో బాధతగ్గింది. పాపం, అతనుమంచివాడే.

ఎందుకో-ఈమధ్య, ఏమాత్రం అలసట అయినా ఎక్కువ భయంవేస్తుంది. ప్రతి క్షణం మృత్యువు తనని వెన్నంటి ఉన్నట్లే తోస్తూంది. తన జీవితకాలంలో నాల్గవ భాగం ఎప్పుడో గడచిపోయింది. ఇంతకాలానికి తాను

సాధించినదేమిటో తెలియదు. రోజులు దొంతర్లు దొంతర్లుగా ముందుకు వచ్చి సాగిపోతున్నాయి.

ఎప్పుడో ఏడు సంవత్సరాల క్రిందట తాను ఇంకా విద్యార్థినిగా ఉండేటప్పుడు తనకి కోరిక లెన్నో ఉండేవి. తన చుట్టూ ఊహలన్నీ ఎన్నో అల్లుకునేవి. తను ఎప్పుడో గొప్ప డాక్టరు అవుతుంది; ఎంతమందికో సేవచేస్తుంది. కమల కాంతుని వివాహంచేసుకొంటుంది... ఇల్లాగ ఇంకా ఎన్నో. కాని, ఇందులో ఏవీ ఫలించలేదు.

కమలకాంత్, తనూ కలిసి బి. ఏ. వరకు చదువు కొన్నారు. ఆ రోజులలో తరుచు కలుసుకుంటూనే ఉండే వాళ్ళు. ఎక్కువ చనువు లేకపోయినా, తగినంత పరిచయ ముండేది. బి. ఏ. అయ్యాక తను డాక్టరుచదవాలనుకొన్నది. అతను పెద్ద చదువులకని ఇంగ్లండు వెళ్ళాడు. వెళ్ళేముందర తనకు కనిపించలేదు. ఎప్పుడో ఒక ఉత్తరం వ్రాశాడు. మళ్ళీ అతని జాడ తనకి తెలియలేదు. తను చదువు పూర్తి చేసుకొని అతనికోసం ఎదురుచూస్తోంది. ఎప్పటికైనా అతను వస్తాడని ఏదో నమ్మకం. అందుకనే ఎన్నాళ్ళయినా ఎదురుచూడగలదు. అతను రాకపోయినా ఫరవాలేదు. ఆకాశాన పూలు అందకపోయినా దూరాన్నుంచే వాటిని చూసి ఆనందించడం, ఆరాధించడం కొందరికి అలవాటు. అందని పూలకి రంగులు కల్పించుకొని, సువాసనలు ఊహించుకొని మురిసిపోతుంటారు. తనూ అంతే. తన జీవితమంతా ఈ ఆరాధనలోనే గడచిపోవాలి. అంతే తను కోరుకొనేది.

నిజానికి, కమలకాంత్‌తో తనకి ఎక్కువ పరిచయ ముండేదని చెప్పుకోవటానికి వీలులేదు. ఒకే కాలేజీలో ఉండడంచేత ఏ కొద్దిసార్లో తప్పనిసరిగా కలుసుకోవలసి వచ్చేది. అతను ఎంతో అందగాడని, ఎంతో మంచివాడని అనుకున్నది. చక్కగా పాడతాడని విన్నది. ఆ మధ్య ఎవరో తన కొక పద్యం వ్రాసి పంపారు. అది అతనే వ్రాసి ఉంటాడని ఆమె ఊహ. అందులో లేని భావాలెన్నో ఆమె ఊహించుకొన్నది. అతనిని ఒక ఆదర్శవ్యక్తిగా చిత్రించుకొన్నది. క్రమంగా ఆ భావంతోనే అతనిని ఆరాధించడం మొదలుపెట్టింది.

తను ఈ ఇంట్లో, ఈ ఊళ్ళో అడుగుపెట్టి మూడు సంవత్సరాలు కావస్తోంది. చదువు పూర్తిఅయ్యాక ఉద్యోగంచెయ్యాలని అనుకోలేదు. అమ్మా నాన్నా చిన్నప్పుడే పోయారు. జీవితమంతా మేనమామల ఇంట్లోను, హాస్టలులోను గడచిపోయింది. ఈ ఊళ్లో తన కొక ఇల్లు ఉన్నదని తెలుసు. ఎప్పుడో అమ్మా నాన్నా ఇక్కడ ఉండేవాళ్లు. తరువాత చాలారోజులు ఇల్లు తాళాలుపడి బూజుపట్టి ఉండేది. చదువు పూర్తిఅయ్యాక, తనకి మళ్లా అక్కడ ఆ ఇంట్లో ఉండాలనిపించింది. అక్కడే ప్రాక్టీసు చేసుకొంటూ తను ఊరివాళ్లకు సహాయంగా ఉండవచ్చు ననుకున్నది.

అక్కడికి వచ్చిన రోజే తనని రంగమ్మగారు చూడటానికి వచ్చింది.

'ఇన్నాళ్ళకి ఈ ఇంట్లో మళ్ళీ దీపం పెట్టటానికి వచ్చావా తల్లీ!' అన్నది.

ఆరోజునుంచీ తనకి ఆవిడే అన్నింటికి ఆసరాగా ఉన్నది.

హాల్లో గడియారం అయిష్టంగా ఏడు కొట్టింది. ఇంక లేవక తప్పదనుకొన్నది మాలతి. మెల్లిగా లేచి స్నానంచేసి తల ఆరబెట్టుకొన్నది. తెల్లని పట్టుచీర కట్టుకొని కళ్ళనిండా కాటుక పెట్టుకొన్నది. ఆతరువాత దేవుడిగదిలోకి వెళ్ళి పూజచేసుకొన్నది. పటాలన్నింటిని చాలా చక్కగా పూలతో అలంకరించింది. ఆ సాంబ్రాణి, అగరువత్తుల వాసన గది అంతా వ్యాపించింది. ఆ గదిలోనే ఓ మూల కమల కాంత్ బొమ్మ కూడా ఉన్నది. అన్ని పటాలతో బాటు దానికీ రోజూ పువ్వులు పెడుతుంది. భగవంతునితో సమానంగా ఒక వ్యక్తిని ఆరాధించడం పుణ్యమో, పాపమో! అయినా, అసహజం మాత్రం కాదేమో. ఆ ఫొటో ఎవరిదని ఎంతమందో ఆమెను అడగకపోలేదు. ఆ ప్రశ్నకు మాత్రం ఎన్నోసార్లు, తనకి వినబడనట్లే, బదులు చెప్పకుండా ఊరుకొనేది.

ఆవేళ మబ్బుగా చల్లగా ఉన్నది. ఏమీ తోచక ముందర తోటలో పూలమొక్కల మధ్యన కూర్చొన్నది మాలతి. రంగు రంగుల పూవులు చక్కగా వికసించి కన్నుల పండువుగా ఉన్నాయి. ఎంత ప్రశాంతంగా, ఎంత మనోహరంగా ఉంది! ఏదో చెప్పలేని హాయి. అయితే, అందులో కూడా ఏదో వెలితి.

ఈ నిమిషంలో కమలకాంత్ ఎక్కడ ఉన్నాడో! ఏం చేస్తున్నాడో! తనకి ఒక్కటే కోరిక ఉంది. ఏ కారణంచేతనైనా తన జీవితం పరిసమాప్తమయ్యేటట్లయితే ఆ ఆఖరు

క్షణాలలోనైనా ఒక్కసారి కమలకాంత్‌ను చూడగలిగితే అంతే తనకు కావలసింది.

*　　　*　　　*

ప్రొద్దు వాలుతోంది. తనని పేషెంట్సు ఎక్కువ బాధించరు. కరుణాకరం ఉన్నచోట తన అవసరం చాల తక్కువ. అందుకే ఆమెకు కావలసినంత తీరిక. రోజంతా ఏవో ఊహాలతో, కలలు కంటూ, కూర్చోవడానికే సరి పోతుంది.

ఆ రోజు చీకటిపడుతూండగా రంగమ్మగారు వచ్చింది. ఆవిడతో కూడా మరొక క్రొత్త ఆవిడ ఉన్నది. సన్నగా, పొడుగ్గా ఉంది. అంత రూపసి కాకపోయినా, ముఖం కళగా ఉన్నది. రంగమ్మగారు ఆవిడ తన బంధువని, భర్తతో గూడా ఆవేళే వాళ్ళింటికి వచ్చిందనీ, రేపో ఎల్లుండో, అంతా కోన చూడడానికి వెళ్ళుతారని చెప్పింది. ఆ వచ్చినావిడ, కాంతమ్మ, అతిగా మాట్లాడకపోయినా ముభావంగా లేక, చక్కగా స్నేహంగా ఉన్నది. ఆమె ఉన్న అరగంటలోను మాలతికి ఆవిడను గురించి అనేక విషయాలు తెలిశాయి. ఆవిడ ఎక్కువ చదువుకోలేదుగాని సాహిత్యంలో అభిరుచి ఉన్నది. సంగీతం చక్కగా నేర్చుకొన్నది. ఆవిడ భర్త కలక్టరు. అతనికి ఉద్యోగం ధ్యాస తప్ప వేరే ఏ ఆసక్తీ లేదు. అస లతనికి ఆవిడతో సావకాశంగా మాట్లాడడానికి కూడా తీరిక లేదు. ప్రస్తుతం వాళ్ళు ఉన్న ఊరు ఇక్కడికి దగ్గరే. ఇక్కడ రంగమ్మగారు ఉన్నారని, కోనకూడా చూడవచ్చునీ ఎన్నాళ్ళనుంచో ప్రయత్నంచేస్తే ఇప్పుడు రాగలిగారు.

ఈ కబుర్లన్నీ ఆవిడ ఎంతో ఉత్సాహంగా, అప్రయత్నంగా చెప్పింది. ఆవిడ వెళతానని లేచేసరికి మాలతికి ఆమెతో ఎన్నాళ్ళబట్టో పరిచయం ఉన్నట్లనిపించింది.

మర్నాడు సాయంత్రం ఆమె మళ్ళీ వచ్చింది. మాలతి ఆమెను మధ్య హాల్లో కూర్చోపెట్టింది. దేవుడిగది తలుపు ఓరవాకిలిగా వేసుంది. అగరువత్తుల పొగ సన్నగా బయటికి వస్తోంది. లోపల ఒంటరిగా. నిశ్చలంగా ప్రకాశిస్తూన్న జ్యోతి ఎల్లాగైనా స్వర్గాన్ని అందుకోవాలని తపస్సు చేస్తున్నట్లుంది.

ఉన్నట్టుండి కాంతమ్మ అడిగింది. 'మీరు వివాహం చేసుకోదలుచుకోలేదా' అని.

మాలతి కంగారుపడింది. ఆ ప్రశ్న వేయటానికి ఆవిడకు అంత చనువు ఎక్కడినించి వచ్చిందా అనిపించింది.

'ఏమో, వివాహమనేది అనేక విషయాలపైన ఆధారపడి ఉంటుందిగదా' అన్నది, అస్పష్టంగా, స్వగతంలాగ.

కాంతమ్మ ఊరుకోలేదు.

'ఒంటరిగా ఉండడం కష్టంగాలేదూ!' అని అడిగింది- ఆరితేరిన గృహిణిలా.

'మీకుమాత్రం? ఆయనకి మీతో మాట్లాడటానికే తీరిక ఉండదన్నారు గదా. అప్పుడు ఒంటరిగా తోచకుండా ఉంటుందా?' అన్నది మాలతి- కొంచెం మందలింపుగా.

'దానికేం! ఆయనకు కావలసినవన్నీ చూసుకోడానికి రోజంతా సరిపోతుంది. పైగాఎప్పుడో ఒకసారైనా, యింటికి వస్తారుగా' అన్నది కాంతమ్మ నవ్వుతూ.

మాలతి మాట్లాడలేదు. కాని, తనలో అనుకున్నది: 'నాకు అతనిని గురించి ఆలోచించడానికి రోజంతా సరి పోతుంది. నాకూ ఒంటరిగా వుండదు.'

మర్నాడు రంగమ్మగారు, కాంతమ్మ, తానూ ప్రొద్దున్నే బండి కట్టించుకొని కోనకి బయలుదేరి వెళ్ళారు. కరుణాకరం, కాంతమ్మభర్త ఇద్దరూ తరువాత మోటారు సైకిలు మీద వస్తారని చెప్పింది రంగమ్మగారు.

ఆ ఊరికి పదిమైళ్ళ దూరంలో రెండు కొండలమధ్య ఓ చక్కని సెలయేరు ప్రవహిస్తోంది. అక్కడ ఒక విష్ణు దేవాలయంకూడా ఉన్నది. మధ్యగుడి, చుట్టూనది. మళ్లా ఆ నదిని ఆనుకొని చుట్టూ కొండలు. ఆ ప్రదేశం ఎంతో అందంగా వుంటుంది అంటారు. ఆ గుడికూడా చాల ప్రసిద్ధ మైనది. అక్కడికి వెళ్ళినవాళ్ళ కోరికలు సులభంగా తీరు తాయని, మనస్సు ప్రశాంతంగా ఉంటుందని అంటారు. మాలతి ఇదివరకు అక్కడికి ఎప్పుడూ వెళ్ళలేదు.

ముగ్గురూ కొండ ఎక్కి ఒక పెద్ద చెట్టునీడను కూర్చున్నారు. మగవాళ్ళు కూడా వచ్చాక గుడికి వెళ్ళ వచ్చుననుకున్నారు. మాలతి ఇక్కడ ఇంత ప్రశాంతంగా, ఇంత మనోహరంగా వుంటుందని అనుకోలేదు. ఏదో కలత లన్నీ దూరమై మనస్సు తేలికపడినట్లనిపించింది.

ఆవేళ ఎండతీక్షణత కూడా లేదు. చల్లగాఉంది. ఆ కొండమీద కూర్చుంటే చుట్టూ ఎంతోదూరం కనబడు తుంది. ఎంతచూసినా తనివితీరదు. అయితే, చాలవరకు ఆ కొండప్రదేశమంతటా చిన్న చిన్న గుట్టలు, ముళ్ళ

పొదలు, అక్కడక్కడ దట్టమైన చెట్ల గుంపులు కనిపిస్తాయి. క్రింద నది వంపులతిరిగి సన్నని తెల్లని పాములా కొండను పెనవేసుకొని కనబడుతుంది దూరాన ఎక్కడో ఒక ఎకరం పొలంమాత్రం చక్కగా పండి పచ్చగా తొణికిసలాడు తున్నది. ఆ గుట్టలమధ్య పచ్చని చీర ఆరవేసినట్లున్నది. ఆ కొండపరిదేశంలో ఆ కాస్తమేరా ఎండిపోయిన హృద యంలో ఆశారేఖలా తోస్తుంది.

మాలతికి మళ్ళీ కమలకాంత్ జ్ఞాపకంవచ్చాడు. ఇది వరకెప్పుడో కాలేజీవాళ్ళంతా ఎక్స్‌కర్షన్‌కు వెళ్ళినప్పుడు, ఒక రోజున వాళ్ళిద్దరు, ఇట్లాగే కొండఅంచున కూర్చున్నారు. ఇద్దరూ ఏమీ మాట్లాడలేదు. కాని, మౌనమే ఆమెకు ఎన్నో సంగతులు చెప్పినట్లనిపించింది. ఆరోజును ఆమె ఎప్పుడూ మరచిపోలేదు. అతను కూడా తనని గురించి ఆలోచిస్తుంటాడా?

కాంతమ్మ, రంగమ్మగారు ఏవో కబుర్లు ప్రారంభిం చారు. దూరాన ఇద్దరు వ్యక్తులు మెల్లిగా కొండఎక్కి వస్తు న్నారు. అందులో ఒకరు కరుణాకరం. రెండవ వ్యక్తిని కూడా ఎక్కడో చూసినట్లు వున్నదనుకొన్నది మాలతి. కాని, అతను దగ్గరగా వచ్చేవరకూ పోలిక తెలియలేదు.

ఎవరో కాదు; కమలకాంతే. ఇదివరకున్న ఆకారం లోను వేషభాషల్లోను ఎంతో మారాడు. సులభంగా గుర్తు పట్టడం కష్టం. కరుణాకరం అతనిని ఆమెకు పరిచయం చేశాడు. అతను తనను గుర్తించినట్లే కనిపించింది.

అతను మాత్రం పైకి ఏమీ అనలేదు. ఎవరో కొత్త వాళ్ళకి చేసినట్లు నమస్కారంచేసి వూరుకొన్నాడు.

మాలతికి ఎంతో బాధ కలిగింది. ఆమె కమల కాంత్‌ని గురించి ఎన్నో కలలుకన్నది. ఎప్పుడో తిరిగి కలుసుకుంటారన్న నమ్మకంతో ఆ కలయిక ఎట్లాఉంటుందో రకరకాలుగా వూహించి చిత్రించుకొన్నది. అయితే, అతను తనని చూడగానే మతిచలించినట్లు ప్రవర్తిస్తాడని గాని, సాష్టాంగనమస్కారం చేస్తాడనిగాని, ఇల్లాంటి పిచ్చి వూహ లేవీ మాత్రం పెట్టుకోలేదు. కాని ఆమెను చూచి గుర్తించి కూడా పరాయివాడిలా ప్రవర్తిస్తాడని మాత్రం ఆమె ఎప్పుడూ అనుకోలేదు.

కాంతమ్మ భర్తతో 'ఇంత ఆలస్యమైందేం!' అని, ఇంకా ఏదో మాట్లాడుతోంది. కమలకాంత్ భార్యకేసి చూస్తూ ఏదో ఆదుర్దాగా, మధ్య మధ్యన, మాలతి కేసి చూస్తున్నాడు. ఆ చూపులకి అర్థం 'నువ్వు ఇదివరకు సంగతులు ఎత్తకు. మా ఆవిడ అనవసరంగా బాధపడుతుంది' అన్నట్లు ఉన్నది.

మాలతికి రోషం, అసహ్యం, చిరాకు కలిగాయి. ఆమె ముఖంలో కలిగిన మార్పు కనిపెట్టి కాంతమ్మ 'ఏం, అల్లా ఉన్నారేం?' అని అడిగింది. 'అబ్బే! ఏమీలేదు.' అంది మాలతి నేలవేపు చూస్తూ.

'ఎండెక్కుతోంది, గుడికి వెళ్ళగూడదూ! మళ్లా తలుపులు మూసేస్తారేమో' అన్నది రంగమ్మగారు. అందరూ కొండదిగి గుడికి వెళ్లారు.

గుడిమెట్లదాకా వెళ్లాక కమలకాంత్ 'నేను రాను, మీరు వెళ్లండి' అన్నాడు.

మాలతి తెల్లబోయింది.

కాంతమ్మ ప్రాధేయపడుతూ 'ఈ ఒక్కసారి రాకూడదా, ఎప్పుడూ రాకపోతే మానె' అన్నది.

కమలకాంత్ విసుగుతో 'నువ్వు వెళుదూ, ఇవ్వన్నీ నాకు నమ్మకంలేదు. ఆ పుణ్యమేదో నువ్వే సంపాదించుకురా. నేను ఇక్కడ తీరిగ్గా కూర్చొని సిగరెట్టు కాల్చుకుంటాను! అని, అక్కడ మెట్లమీద చతికిలబడ్డాడు.

కాంతమ్మకన్న మాలతి ఎక్కువ చిన్నబుచ్చుకొన్నది. తను రోజూ గంటలు గంటలు పూజలోనే గడుపుతుందని తెలిస్తే అతను ఇలానె ఏవగించుకొంటాడు కాబోలు. అయినా, ఇప్పుడవన్నీ అతనికి, ఎప్పటికీ తెలియనక్కరలేదు గదా అని ఊరటచెందింది.

'మనం వెళదాం రండి' అని హెచ్చరించాడు కరుణాకరం. పరధ్యానంలోంచి తెప్పరిల్లుకొని అతని వెంబడే వెళ్లింది మాలతి.

పూజ అయ్యాక మల్లెపూలూ, మంచిగంధం తెచ్చి 'ఇవి మీరు తీసుకోండి' అని ఇచ్చాడు కరుణాకరం. అతని దోసిలిలోనుంచి తన దోసిలిలోకి ఆ పువ్వులు తీసుకొనేటప్పుడు ఎందుకో మాలతిహృదయం ఒక్క క్షణం చలించింది.

గుడిలో ఎన్నో అందమైన విగ్రహాలు, శిల్పాలు ఉన్నాయి. కమలకాంత్‌కు అవి చూడాలన్న కుతూహలం కూడా లేకపోయిందిగదా అనుకున్నది మాలతి. తానూ, కరు

నాళరం ఒక్కొక్కటి తీరికగా, చక్కగా పరిశీలించి చూచి వచ్చారు.

బయటికి వచ్చాక 'సాయంత్రం దాకా ఇక్కడేఉంటే బాగుంటుంది గదా!' అన్నాడు కరుణాకరం. మాలతికి కూడా ఆ చోటు విడిచిపెట్టి వెళ్ళాలని లేదు. కాని, కమలకాంత్ మాత్రం వెంటనే వెళ్ళిపోవాలన్నాడు. అతను కలక్టరు. ఎన్నో బాధ్యతలు, ఎన్నో పనులు కలవాడు.

'ఏం పనిలేనివాళ్లయితే సావకాశంగా ఈ అడవిలో కూర్చోవచ్చు' అన్నాడు వ్యంగ్యంగా.

మాలతికి అతని ధోరణి నచ్చలేదు. ఎంతో గర్విష్ఠిలా తోచాడు. అతనికి ఎంతసేపూ తనని గురించి తప్ప, ఇతరులను గురించిన ఆలోచన లేనట్లున్నది.

వెంటనే అందరూ తిరిగి వచ్చేశారు.

*　　　*　　　*

ఆరోజే కాంతమ్మ, కమలకాంత్ ఊరికి వెళ్ళి పోయారు.

సాయంత్రం సంధ్యాకాంతి ఎర్రగా ఆకాశమంతా అలముకొని రాగరంజితమైన కన్నెముఖంలా ప్రకాశిస్తూంటే మాలతి డాబామీద కూర్చున్నది.

పడమట మేఘాలు వింతవింత రంగులతో, వింతవింత ఆకారాలు దాలుస్తున్నాయి. ఆ చోద్యం చూస్తూ మాలతి నిట్టూర్చింది.

ఇట్లాగే, ఊసుపోక, ఏవో వ్యూహాలు కల్పించుకుంటాం. ఒక వ్యక్తిని సృష్టించుకొని ప్రాణంపోస్తాం. కాని, ఎప్పుడో ఆ కల్పన కదలిపోతుంది వర్షం కురిసి వెలసినట్లు. ఆ తరువాత మనస్సు ప్రశాంతంగా ఉంటుంది అనుకుంది మాలతి.

క్రమంగా ఆ ఎర్రని కాంతి సన్నగిల్లి చీకటి అలముకొన్నది. మళ్లా ఆ చీకటి తెర తొలగించుకొని వెన్నెల ప్రకాశించింది. ఆ తెల్లని కాంతిలో మాలతి కాటుకకళ్ళు తళతళ మెరిసినవి. ఆమె కనుకొలుకుల్లో రెండు అశ్రుబిందువులు తొణికిసలాడినవి. అది సుఖమో, దుఃఖమో ఆమెకే తెలియలేదు !

శ్రీమతి ఆచంట శారదాదేవి కథలు నాకు వీణా గానాన్ని స్ఫురింపజేస్తాయి. అది అపశ్రుతి లేని గానం; హెచ్చు స్థాయికి పోకుండానే ఎన్నెన్నో సంగతులు పలికించే గానం; యెదలోపలి యెదలో లేత కెరటాలను లేపుతూ దిక్చక్రాల కావలనుండే దివ్యలోకాల దిశలో పాఠకుని గొంపోయే గానం.

వీణాగానంలోని లాలిత్యంతోపాటు అప్రయత్న శిల్ప సౌందర్యం ఆమె కథలలో గోచరిస్తుంది. అంతర్వ్యాప్తంగా ఆమె కథలలోని భావలాలిత్యానికి, శిల్ప సౌందర్యానికి మూగ సందేశ సౌరభాన్ని కూర్చుతున్నది.

ఆంధ్ర కథాసాహిత్యంలో శారదాదేవి కథలు ఉన్నత స్థానాన్ని అందుకోగలవని ఆశిస్తున్నాను.

విజయవాడ,
27-8-'60.

ఇట్లు,
నార్ల వెంకటేశ్వరరావు.